# మీతో మీ అభిమాన రచయిత్రి


















ఎమ్. బాలయ్య B.E., సమర్పించు-
అమృతా ఫిలింస్...

# నేరము శిక్ష

దర్శకత్వం: కె. విశ్వనాథ్



నిర్మాతలు:
అలపర్తి సూర్యనారాయణ
మన్నవ వెంకటరావు
కథ బాలయ్య B.E.,
సంగీతం: ఎస్. రాజేశ్వరరావు

శ్రీ ఫిలింస్

'ప్రశ్నావళి' శీర్షికకి ప్రశ్నలను పంపేవారు కవరుమీద స్పష్టంగా 'ప్రశ్నావళి,' ఆంధ్ర సచిత్ర వార పత్రిక, మద్రాసు — 1.' అని వ్రాయకోరుతున్నాము.— సం॥







# ఉత్తరాలు

స్థలాభావంవల్ల ఈవారం 'విధులకోసం వేట' శీర్షికని ప్రచురించలేకపోతున్నాము.
—సం॥

## ముఖచిత్రం

కాంతులు చిందే 'కాంచన' రూపం కాంచిన వారికి కనువిందు.

చిరునవ్వు చిందే ఆ చిత్రతార ముఖచిత్రం అత్యంత మనోహరం. ముఖచిత్రాలు ఆకర్షణీయంగా ఉంటున్నవి

శ్రీ తిరుమల రామచంద్రగారి 'హైదరాబాద్ నోట్‌బుక్'లో విఖ్యాత రచయిత డా. ఆరిపిరాల విశ్వంగారికి వరల్డ్ పోయట్రీ సొసైటీ ఇంటర్నేషనల్ వారి అవార్డు లభించినట్లు తెలియజేసారు. ఈ విషయానికి ఆనందిస్తూ, తెలుగు రచయితకే అవార్డు ఇవ్వబడినందుకు గర్విస్తున్నాను. డా విశ్వం గారికి నా శుభాకాంక్షలు.

ఆర్ శివాజీకుమార్, (గ్రా॥ రాజుచీపురుపల్లి)

## వ్యాసాలు

13—7—73 వారపత్రికలో శ్రీ కె వి. కొండయ్యగారు వ్రాసిన 'లిపి సంస్కరణ' వ్యాసం చదివాను. ఈ విషయంలో వారు చేసే కృషి చాలా అభి అభినందనీయము

'లిపి సంస్కరణ' విషయం మనం చాలా దూర దృష్టితో ఆలోచించవలసి వున్నది. దురదృష్టవశాత్తు మన తెలుగువారికి తాత్కాలిక ఆవేశమే కాని విషయాన్ని కూలంకషంగా చర్చించి ముందు తరాల వారి బాగు కూడా దృష్టిలో పెట్టుకుని ఏ నిర్ణయాన్ని తీసుకోవడం జరగటంలేదు.

ఈ 'లిపి సమస్య'ని ఒకప్పుడు మహారాష్ట్రీయులు కూడా ఎదుర్కొనవలసి వచ్చింది. వారందరూ భావితరాల వారిని దృష్టిలో పెట్టుకుని ముద్రణ, టైపు అధికముగా టెలిప్రింటరుకి కూడా ఉపయోగంగా వుండే విధంగా 'సంస్కృత లిపి'ని అప్పుడు ఉపయోగంలో వున్న 'మోడి' లిపికి బదులుగా వారు నిర్ణయించారు. దానివల్ల వారు ఎంతో లాభం పొందిన విషయం విడిగా వ్రాయనక్కరలేదు అదేవిధముగా భగవంతుడు మన తెలుగువారికి కూడా సంస్కృత లిపి వాడే నిర్ణయాన్ని తీసుకునే స్థైర్యం ధైర్యం యివ్వాలని ఆశిస్తూ

పి సె సూ. శర్మ, (బిలాస్‌పూర్)


# ఆంధ్ర సచిత్ర వారపత్రిక

వ్యవస్థాపకులు:
దేశోద్ధారక కాశీనాధుని
నాగేశ్వరరావు పంతులుగారు
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
(1938—1972)
శుక్రవారం: 3-8-73
శ్రీప్రమాదీచనామ సం॥ శ్రావణమాసం శు సంచిక
సంపుటము : 66 సంచిక : 46
స్థాపితం 1908
సంపాదకుడు:
శివలెంక రాధాకృష్ణ
ఆంధ్రపత్రిక కార్యాలయము
7. తంబుచెట్టి వీధి, మద్రాసు-1
విడి ప్రతి వెల 50 పైసలు


## విషయానుక్రమణిక

బాగా బ్రతుకుతున్నపుడే చేరుతారు రాబందుల్లా బంధువులు
చెడిపోయి తిరుగుతున్నపుడే చేరదీస్తారు నిజమైన స్నేహితులు
ఈ నగ్నసత్యానికి ప్రతిరూపమే.....



బి. అచ్యుతరామరాజు సమర్పించు
శ్రీ వాణీ కంబైన్స్ వారి

# స్నేహబంధం

కథ, నిర్మాత
ఎస్.వి. సుబ్బరాజు
స్క్రీన్ ప్లే - దర్శకత్వం
పి. చంద్రశేఖరరెడ్డి బి.ఎ.

మాటలు: దాసరి నారాయణరావు
పాటలు: ఆత్రేయ
సంగీతం: సత్యం
కెమెరా: వి.వి.ఆర్. చౌదరి
ఎడిటింగ్: నాయని మహేశ్వరరావు
కళ: చలం
అన్నపూర్ణా పిక్చర్స్ రిలీజ్

ANNAPURNA

# హైదరాబాద్ నోట్‌బుక్

## తిరుమల రామచంద్ర

**గవర్నరు హితవు:**

ఉస్మానియా విశ్వవిద్యాలయం టాగోర్ ఆడిటోరియంలో జులై 9వ తేదీనుండి 12వ తేదీ వరకు జరిగిన 20వ అఖిల భారత లైబ్రరీస్ కాన్ఫరెన్సును ప్రారంభిస్తూ గవర్నర్ శ్రీ ఖండూభాయ్‌దేశాయి చెప్పిన హితవు ఇంకా చాల సంవత్సరాల వరకూ కూడా మనకు ఉపాదేయమే. పాశ్చాత్య దృష్టితో, దేశ భాషల పెంపు దృష్టితో గ్రంథాలయాలను అభివృద్ధి చేయాలని ఆయన కోరారు. నిజం. దేశం స్వతంత్రమై స్వాతంత్ర్య రజతోత్సవం జరుపుకొన్నా, దేశ మానసం మనకు పోలేదు. మన ఆచారధారమన మేధతో మన మనస్సుతో జరిగిన నాటి శాస్త్రాలు, సిద్ధాంతులూ నేటికీ మంచి పరిభాషా మూలబంధంతో ఉన్నాయి. పెరవారి పరిణతిని గ్రహించి మన ప్రగతికి పరిణమింప జేసుకొన్నప్పుడే మనకీ ఏదైనా లభిస్తుంది. ప్రపంచ భావధారకు మనం మనంగా సేవ చేసిననాటి మన వైభవం వేరు; ఇతరులది; మనం ఎంత మనదనుకున్నా పరాయిదే. కనుక గవర్నర్ అన్నట్టు మన దేశీయ భాషా గ్రంథాలయాలు పెరగాలి.

**కంచెయే చేనుమేసిన...**

సూపర్ బజారుల ఉద్దేశం ప్రజలకు అలభ్య వస్తువులను గూడ లభింప జేయడం. అలాటి సూపరు బజారులు నిత్యజీవితావసర వస్తువులనే సరఫరా చేయలేనప్పుడు ఎవరిని ఏమందాము? సికిందరాబాద్‌శాఖ సూపర్ బజారులో బియ్యం చక్కెరవంటి దైనందిన ఉపయోగ వస్తువులకోసమే నెలలో పదిహేనుసార్లు తిరగవలసి వస్తున్నదని గ్రాహకులు బాధపడడం వింటున్నాము. ఇంత శ్రమపడి తిరుగుతూంటే, ఒకొకసారి, 'ఇదిలేదు; అదిలేదు; మరొకటిలేదు' అని తాటికాయలంత అక్షరాలతో ఎదుట బోర్డులు వ్రేలాడుతాయి. ఇలాటి పరిస్థితిలో తమ రేషను కార్డులు రిజిస్టరు చేసుకొన్నవారు ఏమైపోవాలి? అధికారులు ఈ విషయం గమనిస్తే ఎంత బాగుండును?

**ఈ దోవ:**

డాక్టర్ బెజవాడ గోపాలరెడ్డిని బంధువులకు పరిచయం చేయడానికి శ్రీ రామనారాయణరెడ్డి కుమార్తె శ్రీమతి భారతీదేవి ఇంట్లో జరిగిన సమావేశం తలవని తలంపుగా సాహిత్య మహాసభ కావడం, జంట నగరాలలోని అన్ని రంగాల మేధావులు పాల్గొని డాక్టర్ గోపాలరెడ్డి రవీంద్రానువాదాలను విని తనిపి, రసామృతం త్రేన్పడం ఇటీవల జరిగిన గొప్ప సాహిత్య సంఘటన— కాకతాళీయమే అయినా, డాక్టర్ రెడ్డి రవీంద్రుని జగత్ప్రసిద్ధమైన ఊర్వశి ఈ దోవ మొదలైన మూడు నాలుగు ఖండికల తమ అనువాదం వినిపించారు. 'రవీంద్రుని శైలి, భావాలు, ఆయన సంస్కృత పద ప్రయోగాలు యథాతథంగా ఆంధ్రులకు తెలుపాలనే ఉద్దేశంతో చేసిన అనువాదమిది' అని ఆయన తమ అనువాద పద్ధతిని వివరించి, రవీంద్రుడు ఊర్వశిని విశ్వసుందరమూర్తిగా, విశుద్ధ లావణ్య మనోహరి— అనంత యౌవనంగా, అనంత విశ్వప్రేయసిగా, పరాశక్తిగా ఊహించారని; ఈ దోవ — అని కాలిబాటపైని రచించిన వచన కవిత 1919 లో రచితమయిందని, దానిని తాము 1952 లో వచనా కవితా గీతంగానే అనువదించానని అన్నారు. ప్రారంభంలో శ్రీ ఉత్పల సత్యనారాయణాచార్యులు తమ కవిత వినిపించారు.

**మన బాటలు:**

జులై చివరి వారంలో కాకినాడలో జరిగిన ఆంధ్రప్రదేశ్ లారీ యజమానుల సంఘం వార్షిక సమావేశాన్ని ప్రారంభించిన తమిళనాడు రవాణాశాఖ మంత్రి శ్రీ ఎస్. రామచంద్రన్ గ్రామాలలో రోడ్ల అభివృద్ధికి కేంద్రప్రభుత్వం భూరి విరాళమివ్వాలని చేసిన సూచన మన పట్టణ నగర ప్రాంతాలకూ వర్తిస్తుందనిపించింది. మా అబ్బాయి శేషశాయి మూడో తరగతి చదువుతూన్నప్పుడు అశోకుని పాఠం వల్లిస్తున్నాడు. నేను ప్రశ్నలు వేశాను—'అశోకుడు ఏమి చేశాడురా, ప్రజలకు?' అని. వాడు తడుముకోకుండా, 'అశోకుడు ప్రజల కోసము చెరువులు త్రవ్వించెను. కాలువలు త్రవ్వించెను; గుంటలు త్రవ్వించెను; బాటలు త్రవ్వించెను.' అంటూ పోయాడు. 'బాటలు త్రవ్వించడమేమిటరా?' అన్నాను. వెంటనే బాటలు వేయించెను - అంటూ, 'మొదట్లో త్రవ్వించనిది ఎట్లా వేస్తారు నాన్నా?' అని ఎదురు ప్రశ్నవేశాడు. ఆ మొదటి దశలో ఉన్నాయి మన రాష్ట్రంలోని మెజారిటీ బాటలు. ఆంధ్రప్రదేశ్‌లో తిరిగిన వాహనాల విలువ తరుగుతుందనేది ప్రపంచ భాషలలో నానుడి అయిందని ఆటోమొబైల్ తత్త్వవేత్తలంటారు. జంటనగరాలలోని కొన్ని వీధులలో రాత్రిళ్ళు వెళ్లుతుంటే, కొన్ని గుంటలు మామూలువో మ్యాన్‌హోల్సులో పాతాళకుహరాలో తెలీవు. మన మ్యాన్‌హోల్సు ఎవరో ఆంగ్ల నవలాకారుడు వర్ణించిన స్థితి జ్ఞాపకం వస్తుంది.

**కొత్త పోలీసు ఇన్‌స్పెక్టర్ జనరల్**

జులై 15వ తేదీన పదవీ విరమణ చేసిన శ్రీ బి. ఎన్ కల్యాణరావు స్థానే పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్‌గా శ్రీ అబ్దుస్సలాంఖాన్ నియమితులు కావడం ప్రబంధాలలో వర్ణించినట్టు న్యాయపరులకు ఆనందం, అన్యాయపరులకు అతిభయం కలిగించింది. ఎన్నో సాహస సేవలకు పతకాలు, బిరుదాలు పొందిన శ్రీ అబ్దుస్సలాంఖాన్ నిజాం కళాశాలలో బి.ఏ. పట్టం పుచ్చుకొని 1941లో పోలీసు శాఖలో చేరినప్పటినుంచి కర్తవ్య నిష్ఠతో, ప్రజాహిత దృష్టితో పనిచేసి, నగరంలో ఎన్నో భద్రతలను ప్రవేశ పెట్టారు; అరాచకాన్ని, అశాంతిని తొలగించడానికి కృషి చేశారు. సమీపించిన వారిని సమ్మాన దృష్టితో చూచి చిరునవ్వులతో సమాశ్వాసం కలిగించి, కష్టాలు

అమ్మా,
వాళ్ళ
బాత్‌రూమునుండి
అంత చెడ్డ
వాసన వస్తుందేం,
మనదాంట్లో మంచి
వాసనేస్తుండగా?

మనం
ఓడోనిల్
వాడతాముగామరి!




ఓడోనిల్ భరించలేని దుర్వాసనలను మరుక్షణంలో దూరం చేసి మీ మరుగు దొడ్డిని పరిశుభ్రంగా తాజా సువాసనలతో నింపుతుంది. ఓడోనిల్ అనేక సువాసనలలో లభిస్తుంది. రకరకాల సైజుల్లోనూ, నమూనాలలోనూ, ప్యాక్‌లలోనూ లభిస్తుంది.

బల్సారా
—సౌఖ్యమైన జీవనానికి
అధునాతన సాధనాలు
BALSARA బల్సారా అండ్ కంపెని (ప్రై.) లి.
43, నగీన్‌దాస్ మాస్టర్ రోడ్, బొంబాయి-400 001.

CHAITRA-BLS-7 Tel

తొలగించడానికి పూనుకొన్న శ్రీ ఖాన్ ఆంధ్రావళికి ఇంకా ఎన్నో రక్షణలు కల్పిస్తారు. దొంగరవాణాను కరికట్టడానికి మరెన్నో కట్టుదిట్టాలు చేస్తారు; చేస్తారు.

**వసుచరిత్ర కవితావిపంచి :**

వసు చరిత్ర రచితమై నాలుగు శతాబ్దాలు గడచిన శుభ సమయంలో ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడెమీ జూలై 8వ తేదీన సారస్వత పరిషత్తు హాలులో ఏర్పాటు చేసిన సమావేశం రామరాజ భూషణుని సంగీత సాహిత్య పారదర్శిత్వపు వైభవాన్ని వేలాది శ్రోతలు ఆరగించేట్టు చేసింది. అధ్యక్షత వహించిన డాక్టర్ గోపాలరెడ్డి, వక్తలు శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, ఆయన శిష్యుడు, జంత్ర వాద్య విశారదులయిన శ్రీ చిన్న జక్కులు కుమారుడు, శ్రీ రాజన్న కవి వసుచరిత్ర కవితావిపంచిని మీటి వసుచరిత్ర కవితావీణ పలికించినప్పుడు ఒక్కమారు అందరికీ నాలుగు శతాబ్దాల నాటి విజయనగర వైభవం, కృష్ణరాయ అళియ రామరాయల రూపు ప్రత్యక్షమయ్యాయి.

# హైదరాబాద్...

**డాక్టరు రామరాజు**

డాక్టరు బిరుదు రాజు రామరాజు ఉస్మానియా విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు కావడం ఆంధ్ర సంస్కృత లోకానికి ఆనందం కలిగించింది. సమున్నత సౌమ్య గంభీర సుందర విగ్రహం, హృదయ వైశాల్యం వెలార్చే విశాల ఫాలం, త్యాగరాజస్వామి 'అతికలల్లలాడగనే' అన్న కీర్తనలో లాగ మదురుపై తరంగితమయ్యే భ్రమరకాలు, నుదుటిపై హృదయంలోని అనురాగం తెలిపే శ్రీ చూర్ణరేఖ మనోనిర్మలత్వాన్ని వెలిగక్కుతున్నవా అన్నట్టుండే తెల్లటి దుస్తులు పెదవి దాటితే పృథివి దాటుతుందనే సామెతగా ఆచి తూచి మాట్లాడేతీరు, పరిశీలనా పరాయణత, పరిశోధనదీక్ష వెదజల్లె నిశిత దృక్కులు, విద్యా వైదుష్య సంస్కారం వెల్లివిరిసే ప్రవర్తన — ఇవి డాక్టర్ రామరాజు. విద్యార్థి దశ నుంచి—దాదాపు మూడు దశాబ్దాలుగా— ఆయనను చూస్తున్నాను. రచనలు చదువుతున్నాను; మహాసభలలో, ఇంటా బయటా కలుసుకొంటున్నాను; అదే తీరు, అదే పరిశ్రమ, అదే ప్రవర్తన. మార్పు లేదు.

పోలీసు చర్యలకు పూర్వం సంస్థాన ప్రజామండల్ పోరాటంలో పాల్గొని కృష్ణజన్మస్థానమూ మెట్టిన వీరుడు కావడంవల్లనే కాబోలు జానపదగేయ సాహిత్యంలో పరిశోధన జరిపి డాక్టరేట్ బిరుదు పొందడం! తెలంగాణా రచయితల సంఘం కార్యదర్శిగా, రాష్ట్ర సాహిత్య అకాడమీ సహాయ కార్యదర్శిగా, మరెన్నో సంఘాల నిర్వాహకులుగా వేలాది తాళపత్ర గ్రంథాలు సేకరించారు; మరుగుపడిన మాణిక్యాలు శీర్షికలో పలువురు అజ్ఞాత కవులను పరిచయం చేశారు. పెక్కు తెలుగు ప్రబంధాలనేకాక జాంబవతీ కల్యాణం, శృంగారశేఖరభాణం, వసుచరిత్ర మొదలయిన సంస్కృత దృశ్య శ్రవ్య కావ్యాలను పరిష్కరించి పుణ్యం కట్టుకొన్నారు. వరంగల్ పోస్టు గ్రాడ్యుయేట్ సెంటరులో ప్రిన్సిపాలుగా, ఆచార్యులుగా వుండి ఇంతవరకు అయిదుగురు పి.హెచ్‌డి.లను తయారు చేశారు; మరి ఆరుగురు తయారవుతున్నారు. పరిశోధన వ్యాసాలను దగినవి దాదాపు యాభై వ్రాశారు. చరిత్ర, శిల్పం అంటే అభిమానం, భారతీయ సంస్కృతి అంటే వెర్రి అభిమానం. బిరుదాలయిన ఈ బిరుదు రాజా రామరాజు, ఆకార సదృశప్రజ్ఞుల ఈ రామరాజు మృచ్ఛకటిక రూపకంలో చారుదత్తుడుగా నటించిన ఈ చారుదత్తుని నటనను నేటికీ విదుషీమణులు మెచ్చుకొంటూ చెప్పుకొంటున్న ఈ చారురూపుడు అయిన రామరాజు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో పరిశోధన రంగంలో నవశకం స్థాపిస్తారనే నమ్మకం నాకు పూర్తిగా ఉంది, ఇతర విశ్వవిద్యాలయంలోలాగే, ఉస్మానియాలోను జానపద ప్రదర్శనశాల, 'జానపద' విషయ పరిశోధన, 'జానపద' పత్రిక ప్రచురణ ఈయన కాలంలో జరుగాలని నా ఆశ, జరుగుతాయని నా విశ్వాసం, జరుగుతాయి.

**ఉపశృతి**

రాత్రి పెండ్లిలో వరుడు వధువు మెడలో తాళిబొట్టు కడుతున్నాడు 'మాంగల్య తంతునా' మంత్రం వినబడుతున్నది ఇంతలో బిజిలీ దీపాలు ఆరిపోయాయి. 'అప్ప! క్షణ క్షణ ఖుల్ బిజిలీల చిత్తముల్' అన్నాడు పెండ్లికి వచ్చిన కవీశ్వరుడొకడు. ●


ఇక నించి మనం పచ్చివే ఆహారంగా తీసుకోవాలి - వంట చెరకు, నూనె మసాలా దినుసుల ధరలు యిప్పుడు మనకి అందు బాటులో లేవు


కొత్త పద్ధతిలో తయారైన సర్వరోగనివారిణి ఇది ఆంధ్రకి సంబంధించిన అన్ని జాడ్యాలనికుదుర్చుస్తుంది


అదిదేనిని కుదర్చక పోతే పచ్చుగ్గాని ఆయనకి మాత్రం దానివల్ల లాభం ఉంటుంది.


ఖచ్చితంగా నిన్ను నేను చిత్తు చేస్తాను
మధ్యప్రదేశ్ మంత్రులలో అయిదుగురి రాజీనామా.
మధ్యప్రదేశ్ లో పరిస్థితి:


ప్రమోదాన్ని కలిగించే ప్రయత్నం
జన్మదిన
శుభాకాంక్షలు

## ప్రశ్నోత్తరం

...కె.రామలక్ష్మి...

**ఎన్. ఏ ఆర్, జంషెడ్‌పూర్**

**రామలక్ష్మిగారూ, ఏడువారాల నగలు అంటే ఏమిటి ? అవి మీరెప్పుడేనా ధరించారా ?**

పూర్వం సత్యభామ ధరించేదిట నాకు పెళ్ళి అయేదాకా చిన్నమెత్తు బంగారం కూడాఎరగను!

**ఏ. పి. ఆర్, పాలకొండ**

**బోసి పాపాయి నవ్వుకు బోసి ముద్దరాలి నవ్వుకు అంతర్యం ఏమిటి ?**

బోసి పాపాయి నవ్వు ఏమీ తెలియని అమాయకత్వానికి నిదర్శన అయితే— బోసి ముద్దరాలి నవ్వు అన్నీ తెలిసిన జ్ఞానానికి చిహ్నం.

**వి కె, బాపట్ల**

**మీరు నారీ దృక్పథంలో రాసే వ్యాసాలు ఎంతో బాగుంటున్నాయి.**

థాంక్యూ.

**వి. జె. ఆర్, హైదరాబాదు**

**మనుషులు వింత దూరాన వుంటే మమతలు – అంత దగ్గిర – అగాతాయి అంటారు. ఎంగ చేత?**

దగ్గిరే వుంటే చిన్నమెత్తు లోపాలు కూడా కొండంతలుగా కన్పిస్తాయి. దూరం నుంచి కనిపించవు.

**ఆర్. వి, కొవ్వూరు**

**సంతాపం పై సీలింగు భూముల పై సీలింగు, పట్టణ స్థలాల పై సీలింగు — ఇలా సీలింగులతోనే దేశం అభివృద్ధి చెందుతుందంటారా ?**

సీలింగులు చేస్తే చాలదు అవి అమలులోకి కూడా వచ్చేలా చూస్తే— తప్పక దేశం అభివృద్ధి వైపు పురోగమిస్తుంది

**ఎస్ వి. కె ఎమ్, ద్వారపూడి**

**అత్తగారూ, మీ స్త్రీలకు విద్య అవసరమని నాకు తోసున్నది**

చిత్తం మీలాంటి ప్రబుద్ధులు తక్కువగా వుండడం— మా అదృష్టం!

**వి పి. ఆర్, రాయగడ**

**దేవుడు మత భేదములు ఎందుకు సృష్టించెను ?**

దేవుడు సృష్టించ లేదు లాభసాటి బేరంగా తోచి మనుష్యులే సృష్టించారు.

**వి ఆర్. డి, వేంపల్లి**

**ఎందుకు అక్కయ్యా మగవాళ్ళకు నీవంటే అంత కోపం ? పిచ్చా ? పొగరా అని ప్రాసూంటారు**

వారి అథారిటీని ప్రశ్నిస్తానని!!

**ఎ. ఎన్. ఆర్, బొబ్బిలి**

**నిజానికి విలువ ఎప్పుడు లేకుండా పోతుంది ?**

చెడుబుద్ధితో చెప్పిన నిజానికి ఎప్పుడూ— విలువ తక్కువే అంతకంటే అబద్ధాలే నయం.

**మీ ఆడవారెప్పుడూ మగవారిని తక్కువగా చూస్తారెందుకు ?**

నిజానికి మా ఆడవాళ్లే మీ మగవాళ్లని నిజాయితీగా అంచనా వేస్తారు— మీ మగవారు మా ఆడువారిని వేసేకంటే

**వి. పి. ఆర్, విజయవాడ**

**ఆడదాని జీవితం ?**

ఆడదాని జీవితం అంతా అభిమానాల చరిత్రే!

**మీ ప్రశ్నావళి విలువెంత ?**

ఏ పని విలువేనా అది తెచ్చే ఆనందాన్నిపట్టి వుంటుంది రావుగారూ. ఆనందానికి విలువెలా కట్టడం?!

**ఎంత వచ్చినా కర్చులే. డబ్బు పొదుపు చేయడం ఎలా ?**

వేర్పులేనిచోట పొదుపు కుదరదు. ●

# తరచుగా ఇంట్లో 'డాక్టరు'గా పని చెయ్యాల్సి వస్తుందా ?

## బలీయమైన మరియు విశ్వసనీయమైన అనాసిన్ మీ మందుల పెట్టెలో ఉంచుకోవటం చాలా మంచిది.

ఆ రోజు ప్రతిదీ సక్రమంగా జరుగని రోజులలో ఒకటి. మీరు ఆలస్యంగా లేచారు, ఇంట్లో వంట సామాన్లు అయిపోయాయి. మీ అబ్బాయికి జలుబు చేసింది. ఫ్లూ వస్తున్నట్లు అనిపిస్తుంది.

అతన్ని వేడి పానీయంతో అనాసిన్ ఇచ్చి పడుకో పెట్టండి. సత్వరంగా పని చేసే అనాసిన్ జలుబులు మరియు ఫ్లూల వలన కలుగు నొప్పులను, బాధలను నివారిస్తుంది. డాక్టరు ఇచ్చే విశ్వసనీయమైన మందు లాగా అది ఒక మందుల సమ్మేళనం.



మీ అమ్మాయి ఒంట్లో బాగుండక, బాగా నొప్పి మరియు నడుం నొప్పితో స్కూలు నుంచి త్వరగా తిరిగి వచ్చింది.

ఆమెకు వేడి నీళ్ల కాపు పెట్టి అనాసిన్ ఇచ్చి హాయి కల్పించండి. ఆమె త్వరలోనే సంతోషంగా, కులాసాగా ఉండగలదు. అనాసిన్ కొన్ని రోజులలో కలుగు వ్యథను తగ్గిస్తుంది. ఎందువలనంటే అది బాధను తగ్గించుటయే గాక బాధ వలన కలుగు మానసిక చికాకును సత్వరంగా తొలగిస్తుంది.



మీ భర్త తనపై అధికారితో పేచీ పడి, వ్యాకులత వలన విపరీతమైన తలనొప్పితో బాధ పడుతున్నారు.

ఆయనకు చల్లగా సేద తీర్చే పానీయం, అనాసిన్ ఇచ్చి కులాసా చేకూర్చండి. ఎందువల్లనంటే అనాసిన్‌లో ప్రపంచమంతటా డాక్టర్లు సిఫారసు చేసే బాధా నివారక పదార్థాలు బాగా ఉన్నాయి.



మీరు పార్టీకి ఎన్నో ఏర్పాట్లు చేయవలసి యున్నాయి కాని వ్యవధి చాలా తక్కువ ఉంది. మీరు అలసిపోయారు. తలనొప్పితో బాధ పడుతున్నారు. ఏ క్షణంలోనైనా అతిథులు రాగలరు.

మీ సాయంత్రపు కార్యక్రమం తలనొప్పి వలన పాడు కావచ్చును. సత్వర నివారణ పొందండి. అనాసిన్ తీసుకోండి. మీరు మళ్లీ సంతోషంతో ఉండగలరు. గుర్తుంచుకోండి, మీ కుటుంబపు డాక్టరును పిలువనవసరం లేనిస్వల్ప సందర్భాలలో, బలీయమైన మరియు సత్వరమైన అనాసిన్ వాడండి. అదే మీ ఉత్తమ మిత్రము.



బలీయమైన మరియు విశ్వసనీయమైన

# అనాసిన్

భారతదేశపు
ఎక్కువ జనప్రియమైన నొప్పినివారిణి




Regd User of TM. Geoffrey Manners & Co. Ltd.

A-59




## కోట రాధాకృష్ణమూర్తి

# దయ్యం కనుపించిన రాత్రి

'నేను నమ్మను' అన్నాడు శ్రీహరిరావు పేకముక్కలు కలుపుతూ.

'నమ్మి చెడినవారు లేరు శ్రీహరిరావూ' అంటూ ఏదో బైరాగి పదం ఎత్తుకొన్నాను

బాగా చీకటి పడింది. మిన్నూ మన్నూ ఏకంచేస్తూ కుంభవర్షం కురుస్తున్నది. కరెంటు ఫెయిలైంది, క్లబ్బులో దీపాలు ఉన్నట్లుండి ఆరిపోయాయి. వాచ్‌మన్ వెంకయ్య రెండు కొవ్వొత్తులు వెలిగించి బల్లమీద పెట్టాడు కిటికీలోంచి తొంగి చూశాను. ఎడతెరిపిలేకుండా కురుస్తున్న వర్షంవల్ల వీధులన్నీ దాదాపు నిర్మానుష్యంగా ఉన్నాయి. ఉరుములు, మెరుపులతో ఆకాశం దద్దరిల్లిపోతున్నది. శ్మశానంలో నక్కలు కూస్తున్నాయ్. ప్రకృతి తన శక్తులన్నింటినీ వినియోగించుకొని ప్రళయతాండవం చేస్తున్నది. ఫెళ ఫెళ మంటూ ఎక్కడో పిడుగు పడింది.

కిటికీ తలుపులు మూసి శ్రీహరిరావు కెదురుగా కుర్చీలో చతికిలబడ్డాను, నసుక్కుంటూ. వెధవ వాన! రెండు రోజుల్నించీ ప్రాణాలు తోడేస్తున్నది. వీధిలో కాలు బెట్టడాని కాస్కారం లేకుండా. రంగారావూ, సోమయాజులూ సాయంత్రం ఉరింకే వెళ్ళిపోయారు. ఏవో పన్లున్నవంటూ. అదృష్టవంతులు. ఈపాటికి శుభ్రంగా భోజనాలు పూర్తి చేసుకొని భార్యాబిడ్డలతో కబుర్లు చెప్పుకొంటుంటారు. క్లబ్బులో నేనూ, శ్రీహరి రావు మాత్రమే మిగిలాం, వానను తిట్టుకొంటూ.

ఉరుములు, మెరుపులు:

శ్మశానంలో నక్కల కూతలు, ఎక్కడో ఓ స్త్రీ రోదిస్తున్నట్లు అస్పష్టంగా ధ్వని. వర్షం ఉధృతమౌతోంది.

బల్ల మీద కొవ్వొత్తులు నిశ్చలంగా వెలుగుతున్నాయి. శ్రీహరిరావు సిగరెట్ పీలుస్తూ ఏదో ఆలోచిస్తున్నాడు, కొవ్వొత్తుల మంటకేసి చూస్తూ. గది తలుపు దగ్గర గోడ నానుకొని కూచొని వెంకయ్య ఖంగు ఖంగున దగ్గుతున్నాడు. వర్షం కురుస్తున్న శబ్దం, వెంకయ్య దగ్గూ తప్ప మరే అలికిడీ లేదు. కుర్చీలోంచి లేచి కిటికీగుండా రోడ్డుకేసి చూశాను ఏదో రిక్షా వెళ్తున్నట్లు అనిపించి ఏయ్ రిక్షా అంటూ కేకవేశాను. తన్ను కాదన్నట్లు రిక్షావాడు వెళ్ళిపోయాడు. ఏం చేయడానికీ తోచడం లేదు. ఈ వర్షం తగ్గేటు లేదు. కొంప చేరుకొనే మార్గ మెలాగని ఆలోచిస్తూ గుమ్మం దగ్గర నిల్చొన్నాను

'శర్మా' ఏదుకో పిల్చాడు శ్రీహరిరావు. గదిలోకి వెళ్ళి ఓ కుర్చీ లాక్కొని శ్రీహరిరావు పక్కన కూల్చొన్నాను.

శ్రీహరిరావు నవ్వుతున్నాడు. 'ఊ' అన్నాను

ఏం మాట్లాడడానికి తోచక—

'అయితే ఉన్నాయంటావు, అంతేనా?'

'ఏమిటి?' అన్నాను ఆశ్చర్యంగా.

'అవే ఇందాక నువ్వు చెప్పినవి' అంటూ ఓ విషపు నవ్వు నవ్వాడు శ్రీహరిరావు

'హ్హ వీడి తప్పదయ్యా! వర్షమన్నా వొదలొచ్చు కానీ, ఈ శ్రీహరిరావు వొక

పట్నాన సన్నాసులెట్లు లేదు అని మన స్సులో అనుకొని 'ఉన్నాయనుకొంటాను' అన్నాను కొంచెం విసుగుతో.

నా సమాధానంతో శ్రీహరిరావు తృప్తి పడ్డట్టు లేదు. తల విదిలించాడు.

'అనుకోవడం కాదు, నువ్వు చూశావా?'

'చూసినవాళ్ళు చెబితే విన్నాను' అన్నాను కొంటెగా.

'నో. నో. నువ్వు స్వయంగా చూశావా అని నా ప్రశ్న'

నాకు చిరాకెత్తింది. ఎవడి నమ్మకాలు వాడివి. నమ్మకం లేనివాణ్ణి నమ్మించటం చాలా కష్టం. పైగా ఏ విషయంలో నైనా వాగ్వాదంలోకి దిగి మాటలు పెంచు కోడం నా తత్వానికే విరుద్ధం. అంచేత 'అబ్బ! పోనిద్దూ' అన్నాను రాజీ ధోరణిలో.

ఆకాశంలో పయోధర ప్రచండ ఘోష. వర్షంతోబాటు వెంకయ్య దగ్గు కూడా ఉధృతమౌతున్న సూచన.

'శర్మా! నా ప్రశ్నకు సమాధానం లేదు. ఓటమిని ఒప్పుకో' శ్రీహరిరావు కలహానికి కాలు దువ్వుతున్నాడు.

నాకు అరికాలి మంట నెత్తి కెక్కింది. ఇదెక్కడి గోలరా బాబూ అనుకొన్నాను. శ్రీహరిరావు నన్ను జిడ్డులాగా పట్టు కొన్నాడు ఏదో కొంటె సమాధానం చెప్పి బోల్తా కొట్టించాలి, తప్పదు అనుకొని 'చూడు శ్రీహరిరావూ! నిన్ను నమ్మించడం నా తరం కాదు. ఈ వాగ్వాదం తెగేదికాదు. నీ నమ్మకం నీది, నా నమ్మకం నాది. ఇలాటి విషయాల్లో గెలుపు, ఓటముల ప్రసక్తే లేదు. అన్నింటికి తార్కాణాలు చూపించడం చాలా కష్టం. దేవుడి విషయం తీసుకో కొందరు ఉన్నాడంటారు. మరి కొందరు లేడంటారు. ఉన్నట్టా? లేనట్టా? కంటికి కనుపించనంత మాత్రాన లేడనే నిశ్చితాభిప్రాయానికి రాలేము కదా. ఉదాహరణకు గాలిని తీసుకొందాం. గాలి మన కంటికి కనిపించదు గనుక లేదన గలవా?' అన్నాను నచ్చజెప్పే ధోరణిలో.

శ్రీహరిరావు పెద్దగా నవ్వి 'గాలి కంటికి కనుపించదు నిజమే. కానీ స్పర్శవల్ల ఉనికి నిర్ధారణ చెయ్యొచ్చు కదా!' అన్నాడు.

అలా రా దారికి అనుకొని 'అలాగే దయ్యాలను స్వయంగా చూసినవాళ్ళు చాలా నిశ్చయంగా చెబుతున్నారు. ఉన్నాయని నామాటకు నేను నమ్ముతాను' అన్నాను శ్రీహరిరావు ముఖంలోకి చూస్తూ.

'నీ నమ్మకం కాదు నాకు కావలసింది. నువ్వు చూశావా అని నా ప్రశ్న' శ్రీహరి రావు బల్ల గుద్దటం మొదలెట్టాడు.

నాలో సహనం నశించింది. ఏది ఏమైనా సరే శ్రీహరిరావును ఢీకొనడానికే నిశ్చ యించుకొని 'చూశాను' అన్నాను చాలా నిశ్చయంగా.

'ఎప్పుడు? ఎక్కడ?' నా మీద ప్రశ్నల వర్షం. బయట కుండపోత వాన.

'పల్లెకాట్లో' చెప్పాను మాటలు తడుముకోకుండా.

'నాకు చూపగలవా ?'

చచ్చాను. ఏమిటి నాకీ బెడద ? ఈ శ్రీహరిరావు దయ్యాన్ని చూపమంటా డేమిటి ? దయ్యాలున్నాయో, లేవో దేవు డెరుగు కానీ ప్రపంచంలో దయ్యాలవంటి మనుష్యులున్నారు. అందుకేమాత్రం సందేహం లేదు. ఒక వంక కడుపులో ఆకలి దహిస్తున్నది. ఇంటి దగ్గర పెళ్ళాం బిడ్డలు ఎదురు చూస్తుంటారు. ఈ సంభాషణ కింతటితో స్వస్తి చెప్పాలనుకొని 'ప్రయ త్నిస్తాను.' అంటూ సమాధానం చెప్పాను.

'అలా అంటే కుదరదు, రేపు రాత్రికే ప్రోగ్రాం. నువ్వు నాకు దయ్యాన్ని చూపించినట్లయితే వంద రూపాయల బహుమానం ఇస్తాను. చూపలేకపోతే నువ్వేం పర్వాలేదు. నాకేమి ఇవ్వనక్కర్లేదు' అన్నాడు శ్రీహరిరావు స్పోర్టివ్‌గా.

నాకు ప్రాణం విసుగెత్తి పోతున్నది. మనలో మాట. దయ్యాన్ని నేను చూడ లేదు కానీ ఇంతదూరం వచ్చాక ఇప్పుడు వెనకడుగు వేయటానికి మనస్కరించలేదు. అమీ, తుమీ తేల్చుకోవలసిందే శ్రీహరి రావు పెట్టిన షరతుకు ఒప్పుకొన్నాను.

వర్షం తగ్గుముఖం పట్టింది. సన్నటి తుంపర. ఈదరగాలి శరీరాన్ని వణికిస్తు న్నది. వెంకయ్య గోడకు జేరగిలబడి జోగు తున్నాడు, సన్నగా దగ్గుతూ.

గదికి తాళం వేసుకోమని వెంకయ్యను హెచ్చరించి, శ్రీహరిరావూ నేనూ ఇళ్ళకు బయల్దేరాము, చలికి వణుకుతూ.

* * *

'టార్చిలైట్లు ?'

'రెండు.'

'సిగరెట్లు ?'

'నాలుగు పెట్టెలు.'

'బాణాకర్రలు ?'

'ఎందుకూ?' అని ప్రశ్నించాను.

శ్రీహరిరావు చిన్నగా నవ్వి 'ఆత్మ రక్ష ణకు' అన్నాడు వెక్కిరించే ధోరణిలో.

అవసరంలేదని జవాబిచ్చాను.

'ఎందుకని ?'

'పిచ్చివాడా! ఒక వేళ నిజంగా దయ్యం కనిపించి దాడిచేస్తే దాన్ని ఎదుర్కొనే ధైర్య సాహసాలు మనకు లేవు. ఆయుధాల వల్ల ప్రయోజనం శూన్యం.' అన్నాను శ్రీహరిరావును బెదరగొడుతూ.

అమావాస్య, ఆదివారం రాత్రి పదకొండు కావస్తోంది. దీపాలు లేవు. రోడ్డు మీద బొత్తిగా జనసంచారం లేదు. సిగరెట్లు ముట్టించి శ్రీహరిరావూ, నేనూ శ్మశానం వేపు నడవడం ప్రారంభించాము, చెరొక టార్చిలైటు చేతబట్టుకొని. బీటు కాని స్టేబు లొకాయన నావేపు అదోరకంగా చూస్తూ సైకిల్‌మీద వెళ్ళిపోయాడు. ఇద్దరం నవ్వుకొన్నాము. క్లబ్బును సమీ పించాము. 'వెంకయ్యను తోడు తీసుకెళ్దాం' అన్నాడు శ్రీహరిరావు. పాపం వెంకయ్య ముసలాడు ఈపాటికి వరండాలో కునుకు తీస్తుంటాడు. ఈ సమయంలో అతగాణ్ణి బాధపెట్టడమెందుకు అనుకొని 'వద్దు' అన్నాను.

సన్నటి తుంపర ప్రారంభమైంది. వీధిలో ఓ కుక్క శ్మశానంకేసి చూస్తూ ఏడుస్తున్నది. క్లబ్బు భవనాన్ని దాటాం. తరువాత చిన్న చిన్న పూరిగుడిసెలు. పొద్దస్తమానం చెమటోడ్చిన పాటకజనం భూమాత హృదయంమీద పడుకొని, నిశా కాంత జోలపాటకు ఆదమరచి నిద్ర పోతున్నారు శ్రీహరిరావు నేనూ మెల్లగా అడుగులేస్తూ దింపుడు కళ్ళాం సమీ పించాం శ్మశానం ఇప్పుడు మాకు స్వాగతం పలుకుతున్నది 'శర్మా! ఆంజనేయదండకం పఠించు' అంటూ శ్రీహరిరావు నన్ను హెచ్చ రించాడు. టార్చివేశాను. బాటంతా ఎగుడు దిగుడుగా వుంది. ఇరువైపులా ఏవేవో పిచ్చిమొక్కలు గాలికి తలలు వూపుతున్నాయి. సరసరమంటూ ఏదో చప్పుడు. జబ్బ పట్టుకొని శ్రీహరిరావును వెనక్కి గుంజాను. బారెడు పొడుగున్న కృష్ణసర్పం మెలికలు

తిరుగుతూ రక్కసపొదలోకి మాయమైంది. టార్చి ఆర్పి నక్షత్రాల గుడ్డివెలుగులో నడకసాగించాం. మానవ కపాలాలు, ఎముకలు కాళ్ళకు తగులుతున్నయ్. చింత చెట్టుమీద గుడ్లగూబ వికృతంగా కూస్తున్నది. కన్ను పొడుచుకొన్నా కనిపించని కటికచీకటి, వాతావరణం భయావకంగా వుంది.

'శ్రీ హరిరావూ! జాగ్రత్త' అంటూ హెచ్చరించాను.

'ఊ'

ఏదో పిట్ట సన్నగా ఆర్తనాదం చేస్తూ, వలయాకారంలో పైన చక్కర్లు కొడుతున్నది. మళ్ళీ టార్చి వేశాను. గోరీలు తెల్లగా మెరుస్తూ, మృత్యుదేవత జయపతాకాల లాగున్నవి. ఓ చిన్న గోరీ మీద శ్రీహరిరావూ, నేనూ చతికిలబడి పాలరాతి ఫలకాన్ని పరీక్షించాం.

'రామచంద్ర పట్నాయక్'
జననం 19—10-1905
మరణం 9—5—1937.

పాపం! ఎవరో నిర్భాగ్యుడు, ముప్పై రెండేండ్లకే నూరేండ్లు పూర్తి చేసుకొన్నాడు. బలిజేపల్లి పద్యాలు, జాషువా పద్యాలు చప్పున స్ఫురణకు వచ్చాయి. శ్మశానం ప్రశాంతంగా వుంది. భయంకర నిశ్శబ్దం రాజ్యం చేస్తున్నది. మా ఇద్దరి హృదయాల్లో మాత్రం విడతెగకుండా అశాంతి.

సిగరెట్టు ముట్టించి వాచీ చూసుకొన్నాను. పన్నెండు కావస్తోంది.

'శర్మా!' అన్నాడు శ్రీహరిరావు.

'ఊ' అంటూ దిగులుగా సమాధానం చెప్పాను.

'ఎంతకాలం ఈ శవ జాగరణ?'

శ్రీహరిరావుకు బొత్తిగా ఓర్పులేదు! పట్టుమని పదిః నిమిషాలు ఓ చోట కూర్చోలేడు దయ్యాన్ని చూపించమని నా ప్రాణం తోడాడు. తీరా రంగంలోకి దిగాక సహనం కోల్పోయి ఊదర బెడుతున్నాడు. ఈ జాతి మనుషులతో వేగడం అంత తేలికైన విషయం కాదు. అంచేత నోరు మెదపకుండా కూర్చొన్నాను.

# దయ్యాంకనుపించినా..

ఘల్లు ఘల్లుమంటూ ఏదో చప్పుడు.

శ్రీహరిరావూ, నేనూ, చెవులు రిక్కించాము. నా గుండెలు వేగంగా కొట్టుకుంటున్నై. టార్చి వేసి నమూథుల చుట్టూ కలయ చూశాను. ఏమీ కనిపించలేదు. విక్టర్ విలెన్‌పోలూ, కొంపొరావులూ జ్ఞాపకం వస్తున్నారు.

మళ్ళీ అదే చప్పుడు. రెండు నిముషాల తర్వాత గుండెలు బ్రద్దలు చేసే వికటాట్ట హాసం. జడలు విరియబోసుకొన్న మర్రి చెట్టు వైపునించి.

శ్రీహరిరావును హెచ్చరించి టార్చిని మర్రిచెట్టు కొమ్మల మీదకు ఫోకస్ చేశాను. ఎంతటి గుండెలు తీసిన బంటులనైనా భయభ్రాంతుల్ని చేసే దృశ్యం. మీరు నమ్మలేరు. కానీ నేను నిజం చెబుతున్నాను. నలటి ఓ ఆకారం, ముఖం వికృతంగా భయంకరంగా ఉంది. కళ్ళు చింతనిప్పుల్లా ఉన్నాయి. రెండు చేతుల్తో వేపమండలు పట్టుకొని జానెడు పొడుగున నాలుక చాచుకొని కొమ్మమీద నుంచి గభాలున కిందకు దూకి, మా వైపు వస్తున్నది.

## పాలక్ కూర-పెరుగు పచ్చడి

| | |
|---|---|
| కావలసినవి | —కొలతలు(4గురికి) |
| పెరుగు | —225 గ్రా |
| పాలక్‌కూర | —100 గ్రా |
| పచ్చి మిరపకాయలు | — 5 గ్రా |
| ఉప్పు | — సరిపడినంత |
| పోపు—లేదా తాళింపు : | |
| జీలకర్ర | — 1 చెంచా |
| ఆవాలు | — 1 చెంచా |
| మెంతులు | — 1 చెంచా |
| ఎండుమిరపకాయలు | —రెండు లేదామూడు |
| డాల్డా | — 15 గ్రా |

పాలక్‌కూర కడిగి, ఆవిరిపై ఉడికించుకోవాలి చిలికిన పెరుగులో ఆ బచ్చలికూర, తరిగిన పచ్చిమిర్చి, ఉప్పు కలపాలి. పోపుపెట్టాలి.

—కూ. రా.

'శర్మా! పరుగెత్తు' అంటూ శ్రీహరిరావు పరుగు లంకించుకొన్నాడు.

ఆ ఆకారం శ్రీహరిరావు వెంటబడ్డది.

నాకు నోటమాట రావడం లేదు. ఆపాదమస్తకం భయంతో కంపిస్తున్నది. శిలా విగ్రహంలాగా దాదాపు అచేతనంగా నిలబడ్డాను తర్వాత ఏం జరిగిందీ కొంపకెట్లా చేరుకొన్నదీ నాకు తెలియదు ఐతే ఏం సందేహం నన్ను పట్టుకొని పీడించడం మొదలెట్టింది. ఆ ఆకారం నిజంగా దయ్యమైతే నన్ను వొదిలి, శ్రీహరిరావు వెంట బడటానికి కారణమేమిటి? ఎంత బుర్ర బద్దలు కొట్టుకొన్నా అర్థం కాలేదు.

మర్నాడు ఉదయానికల్లా నా జేబులో నన్నకాగితం రెపరెపలాడుతున్నది శ్రీహరిరావును బతిమలాడాను వొద్దంటూ. కానీ అతగాడు వినకుండా ఓట్టు పెట్టాడు. నాకు తప్పలేదు. ఓకందుకు మెచ్చుకోవాలి శ్రీహరిరావును, మనిషి మొండిఘటమైనా మంచి స్పోర్టివ్ ఫెలో.

సాయంత్రం నాల్గింటికి మామూలుగా క్లబ్బు చేరుకొని ఏదో పత్రిక తిరగేస్తున్నాను. శ్రీహరిరావింకా రాలేదు, వాచ్‌మన్ వెంకయ్య వరండాలో తారట్లాడుతున్నాడు సన్నగా దగ్గుతూ.

'వెంకయ్యా! కాఫీ తీసుకరా' అంటూ ఫ్లాస్కూ, చిల్లర డబ్బులూ చేతిలో పెట్టాను.

'శ్రీహరిరావుగారు డబ్బులిచ్చారా బాబూ?'

'ఇచ్చారు' అంటూ ఏదో పరధ్యానంలో ఉండి సమాధానం చెప్పాను. తర్వాత తమాయించుకొని వెంకయ్యను ప్రశ్నించాను నీకెట్లా తెలుసునంటూ.

'నాకంతా తెలుసుబాబూ, నా వాటా యాభై రూపాయలు నాకిప్పించండి' అంటున్నాడు వెంకయ్య. మధ్యలో దగ్గుతెర అడ్డు వచ్చింది. ఖంగు ఖంగున దగ్గటం ప్రారంభించాడు, ఏమిటీ! ఈ డబ్బులో వెంకయ్యకు వాటా ఇవ్వాలా? ఎందుకూ?

నేను ఆలోచించడం మొదలెట్టాను, కథంతా పూర్తిగా అర్థం కావటానికి ఐదు నిముషాల కంటె ఎక్కువ కాలం పట్టలేదు.

# వారఫలం

## 3-8-1973 శుక్రవారం మొదలు 9-8-1973 గురువారం వరకు

**మేషం:—** వ్యాపారంలో శ్రమమీద అనుకూలత లభిస్తుంది. రాజకీయ వ్యవహారాల్లో శ్రమ కలుగుతుంది. రావలసిన డబ్బు సమయానికి అందుతుంది. నూతన వ్యవహారాలు బాగుంటాయి. వారం ఆఖరులో ప్రయాసమీద ప్రయోజనం మరొకరిదీ కావచ్చును.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. దైవకార్యాలు నెరవేరతాయి.

**వృషభం:—** మీ అంచనాలు సరియైనవని రుజువు కాగలవు. ప్రయాణాలు ఫలిస్తాయి. సాటివారితో వాదప్రతివాదాలు తగవు మీ కార్యక్రమాలకు వారం మధ్యలో మార్పులు వస్తాయి. వారం ఆఖరులో ప్రయత్నించిన ప్రతిపనీ సులువుగా నెరవేరుతుంది

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. విలాస వస్తువులు కొంటారు.

**మిథునం:—** మీ మంచితనమే మీకు యిబ్బంది కలిగిస్తుంది. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. వారం మధ్యలో నూతన వ్యవహారాలు లాభిస్తాయి. వ్యాపారంలో ఆదాయం పెరుగుతుంది రావలసిన డబ్బు సమయానికి అందక పోవడంవలన శ్రమ కలుగు తుంది

స్త్రీలకు:— బంధుమిత్రులను కల్సుకొంటారు. ఆడంబరం కోసం వ్యయం జరుగు తుంది.

**కర్కాటకం:—** వ్యాపార విస్తరణ ప్రయత్నాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది. సాంఘిక కార్యక్రమాలు ప్రోత్సాహకరంగా ఉంటాయి ఇతరుల నిమిత్తం చేసే ప్రయత్నాలు సులువుగా నెరవేరుతాయి. వారం ఆఖరులో వృత్తి వ్యాపారాలు లాభదాయకంగా ఉంటాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది. సాహిత్య కళారంగాల్లో ఖ్యాతి లభిస్తుంది.

**సింహం:—** వృత్తిలో ముఖ్యమైన వ్యక్తులను కల్సు కొంటారు. నూతన వ్యవహారాలు బాగుంటాయి. సాహసముతో కూడిన వ్యవహారాలు లాభిస్తాయి. మిత్రులకు సహాయం చేస్తారు వారం ఆఖరులో సామాన్యమైన పనులకు కూడా మీరు యెంతో కృషి చేయవలసి వస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. బంధుమిత్రులను కల్సు కొంటారు.

**కన్య:—** అన్ని వ్యవహారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది. విద్యా వైజ్ఞానిక రంగాల్లో మీ కృషి రాణిస్తుంది. మీ ఆలోచనలు ప్రయోజనకరంగా ఉంటాయి. అధికారుల వలన జరుగవలసిన వ్యవహారాలు సులువుగా నెరవేరతాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుంటుంది వినోద కాలక్షేపాలలో పాల్గొంటారు.

**తుల:—** మీ ప్రయత్నాలకు ఆటంకాలు వస్తాయి. సాహసముతో కూడిన వ్యవహారాల్లో నష్టం వస్తుంది. వారం మధ్యలో వృత్తి వ్యాపారాలు బాగుంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. సమయానికి యేదో ఒకవిధంగా డబ్బు చేతికి వస్తుంది.

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాలు బాగుంటాయి. పుణ్యకార్యాలు చేస్తారు.

**వృశ్చికం:—** మీ కార్యక్రమాలు నిరాటంకంగా నెరవేరతాయి ప్రయాణాలు ఫలిస్తాయి. వారం మధ్యలో ఉద్యోగంలో కార్యభారం పెరుగుతుంది. విద్యావైజ్ఞానికరంగాల్లో మీ కృషికి ఆటంకాలు వస్తాయి. వారం ఆఖరులో అన్ని వ్యవహారాలు తిరిగి బాగుంటాయి

స్త్రీలకు.— ఆరోగ్యం బాగుండదు నూతన విషయాలను తెల్సు కొంటారు.

**ధనుస్సు:—** ముస్ముందు ఉపయోగించగల పరిచయాలు యేర్పడతాయి. ఉద్యోగంలో గౌరవం లభిస్తుంది సాహసముతో కూడిన వ్యవహారాలు బాగుంటాయి. మీ ప్రయత్నాలు సులువుగా నెరవేరతాయి. వారం ఆఖరులో లాభం రావలసిన వ్యవహారాల్లోనే నష్టం రావచ్చును.

స్త్రీలకు — కుటుంబ వ్యవహారాల్లో శ్రమ కలుగు తుంది. ప్రయాణాలోచనలు చేస్తారు.

**మకరం.—** వృత్తి వ్యాపారాలు అనుకూలంగా ఉంటాయి. నూతన వ్యవహారాలు లాభిస్తాయి. స్థిరాస్థి వ్యవహారాలు బాగుంటాయి. సజ్జన సాంగత్యం లభిస్తుంది మీరు యిదివరకు చేసిన ఆలోచనలు యిప్పుడు ఫలిస్తాయి. ఆదాయం పెరుగుతుంది

స్త్రీలకు — ఆరోగ్యం బాగుంటుంది. శుభ కార్యాల విషయంలో అభివృద్ధిని సాధించగలరు.

**కుంభం:—** ఏ వ్యవహారంలోను సాహసించడం తగదు ప్రయాణాల్లో శ్రమ కలుగు తుంది వారం మధ్యలో రావలసిన డబ్బు సమయానికి అందుతుంది విద్యావైజ్ఞానికరంగాల్లో ఖ్యాతి లభిస్తుంది అన్ని వ్యవహారాల్లోను గౌరవప్రాబల్యాలు బాగుంటాయి

స్త్రీలకు:— కుటుంబ వ్యవహారాల్లో కార్యభారం పెరుగు తుంది బంధుమిత్రులను కల్సుకొంటారు.

**మీనం:—** భాగస్వాములతో కలసి చేసే వ్యాపారాలు బాగుంటాయి ఉద్యోగంలో గౌరవం బాగుంటుంది. వారం మధ్యలో ఆందోళన కలుగు తుంది చేజిక్కిన అవకాశాలు కూడా జారిపోయే ప్రమాదం ఉంది వారం ఆఖరులో అనుకూలమైన మార్పులు వస్తాయి.

స్త్రీలకు:— ఆరోగ్యం బాగుండదు. వినోద కాలక్షేపాల్లో పాల్గొంటారు.

—మహేష్ ●

'డాక్టర్ సలహాలు' శీర్షికకి రాసేవారు తమ పేరు, పూర్తి చిరునామాలని రాయటం అవసరం. ప్రశ్నలు వీలైనంత చిన్నవిగా ఉండేలా రాయాలి. అందరికీ ఉపయోగకరమైన ప్రశ్నలని కూడా పంపవచ్చు. ప్రశ్నలని 'డాక్టర్ సలహాలు, ఆంధ్రసచిత్రవారపత్రిక, 7, తంబుచెట్టి స్ట్రీట్, మదరాసు—1'కి పంపాలి. —సం.




### జరిగిన కథ

రమణమూర్తి, శేఖర్ బాల్య స్నేహితులు. రమణమూర్తి ఒక కంపెనీలో పని చేస్తున్నాడు. శేఖర్ స్టేట్స్‌కి వెళ్ళి భార్య సుమతితో సహా ఇండియాకు వచ్చి రమణమూర్తిని చూడ్డానికి వచ్చాడు. రమణమూర్తి భార్య ఇందిర, సుమతి ఇద్దరూ ప్రాణ స్నేహితులు. శేఖర్‌కి పేకాటపిచ్చి. రమణమూర్తికి అలవాటు చేశాడు. శేఖర్ రిజైన్‌చేసి హైదరాబాదు మారడానికి ప్రయత్నాలు చేశాడది మామగారు పోవడంతో ఆవూరు బయల్దేరింది ఇందిర పిల్లలతో. తండ్రి రమణ పేరుతో వీలునామా రాయడం చాలమందికి కష్టం కలిగించింది. ఆస్తి వ్యవహారాలని లాయర్‌గారికి అప్పగించి శెలవు తీసుకుని తిరిగి వచ్చాడు రమణ. శేఖర్, సుమతి వెళ్ళిపోయాక ఇందిర అదోలా అయిపోయింది. రాజారావుని ప్రేమించింది శిరి ఇందిర ఆమెకి వదిన. వదినతో రాజారావు విషయం చెప్పింది. విజయసారథి, శిరోమణికి స్నేహితుడయ్యాడు.

## 12

సాయంత్రం అయిదు గంటలవేళ పిల్లలు స్కూళ్ళనుండి, కాలేజీనుండి వచ్చేవేళ.

ఇందిరకు వొంట్లో బావుండక రెండు రోజుల్నుంచీ లేవటం లేదు. ఆరోజే కొంత నెమ్మదిగా వున్నది. కొంచెం ఓపిక తెచ్చుకుని నాలుగింటికి లేచి కాఫీపెట్టి 'రెండు మూడు రోజుల్నుండి టిఫిన్ ఏమీ చేయటం లేదు—ఇవాళైనా కాసిని పకోడీలు వేయిద్దాము అని మొదలుపెట్టింది.' పెద్దవాడు శ్రీధర్ మరీను కాలేజీనుండి ఆవురావురుమంటూ వస్తాడు. వాడికంతా తండ్రిగారి పోలిక. బైట హోటళ్ళలో అడ్డమైనవీ తినే అలవాటు లేదు. ఇంట్లో ఏమన్నా చేస్తే తినటం—లేకపోతే గమ్మున వూరుకోటం. అందుకనే వాడికోసమైనా రోజూ ఇంట్లో ఏదన్నా చేస్తుంది—చిన్నమ్మాయికీ మళ్ళీ అదే అలవాటు—ఒక్కరోజు బద్ధకించి ఏమీ చేయకపోతే— 'అబ్బా టిఫిన్ ఏమీలేదా? ఇంటికి రాగానే ఏమన్నా తినాలనిపిస్తుంది బాబు' అని సణుగుడు మొదలెడ్తుంది. దానికి వంతపాటగా పెద్దది శశి! 'అమ్మా రోజూ ఏదన్నా చేయటానికి నీకు ఓపిక లేకపోతే—నాలుగు రోజులకు సరిపడా—మిఠాయో — కారప్పూసన్నా చేసి డబ్బాల్లో పోసి వుంచకూడదూ, ఆదివారం అయితే మేము నీకు సహాయం చేస్తాము' అని ఆరిందాలాగా అంటుంది. అలా అంటే తనకు నవ్వు వస్తుంది. అది అన్నాళ్ళు నిలవవుండేవి ఏమన్నా చేస్తే నాలుగురోజులుండనిస్తారా ఏమన్నానా? ఇటొచ్చి కాస్త—అటొచ్చి కాస్త నోట్లో వేసుకుంటూ నలుగురూచేరి ఒక్కరోజులో ఆ డబ్బా దులిపేస్తేకాని వాళ్ళకు తోచదు. చివరికి తనకు శ్రమే మిగుల్తుంది— అందుకే ఏరోజు కారోజే చేస్తుంది. తనలో తను అనుకుంటూ వుల్లిపాయలు తరిగి శనగపిండిలో కలిపి సిద్ధంచేసి — స్టౌ మీద మూకుడు పెట్టింది. హాల్లో ఫోన్ రింగ్ అవుతూంది. శనగపిండి మూకుడులో వేస్తున్న తొందరలో వినిపించుకోలేదు ఇందిర

ఫోన్ అదేపనిగా మ్రోగుతూంది. 'అబ్బబ్బ చేతులో పనివున్నప్పుడే ఈ ఫోన్ వస్తుంది' అని విసుక్కుంటూ ఇవతలకు రాబోయింది. అప్పుడే స్కూలునుండి శశి, శార్వాణి రావటంతో—

'అమ్మాయ్! చూడండే ఎవరో ఫోన్ చేస్తున్నారు. నాన్నగారి కోసమేమో, ఇంకా ఆఫీసునుండి రాలేదని చెప్పండి' అని తన పని చూసుకోసాగింది.

'అమ్మా! నిన్నే అడుగుతున్నారు. ఎవరో సబ్ఇన్‌స్పెక్టరుట!' అని శార్వాణి అనటంతో, 'చేతిలో పనివదిలి ఒక్క అంగలో ఫోన్‌దగ్గరకొచ్చి.

'హలో...ఎవరండీ?' వణికేకంఠంతో అడిగింది.

'నేను సబ్ఇన్‌స్పెక్టర్‌ రాఘవ్‌ను మీరు ఇందిరగారేనా'

'అవునండీ, ఏమిటి విశేషం?' రమణ రఘవ్ స్నేహితులు—రమణకోసం అప్పుడప్పుడు ఇంటికి వస్తూంటాడు కూడాను. ఇందిరకూ రఘవ్ పరిచయమే—అందుకే రాఘవ్ అంటే కాస్త ధైర్యం కలిగిందామెకు.

'అమ్మా ఇందిరగారూ! నేను చెప్పేది మీరు ధైర్యంగా వినండి. భయపడాల్సింది ఏమీలేదు మన రమణకు చిన్న ఏక్సిడెంటు అయింది. సమయానికి నేను అక్కడ వుండటం అదృష్టం—జనరల్ ఆస్పత్రిలో చేర్చాము. నాలుగోవార్డు—17 నెంబరు బెడ్. మీరు శ్రీధర్‌ను సాయం తీసుకుని వెంటనే రండి. కంగారు పడకండమ్మా' అని మరోసారి చెప్పి ఫోన్ పెట్టేశాడు. రాఘవ్ మాటలన్నీ ఇందిర వినలేదు 'రమణ ఏక్సిడెంట్' అన్నమాట వింటూనే— ఇందిర చేతిలో ఫోను జారిపోయింది. కళ్ళు బైర్లుకమ్మి, వళ్ళంతా చెమటపట్టేసి తూలి పడబోయింది. అక్కడే

వున్న శశి గభాల్న తల్లిని పట్టుకుని సోఫాలో పడుకోబెట్టి-చల్లని నీళ్ళు తెచ్చి మొహాన చిలకరించి తుడిచి, 'అమ్మా—అమ్మా ఏమిటమ్మా ?' అని ఆదుర్దాగా అడుగుతోంది.

శ్రీధర్ కాలేజినుండి వస్తూనే ఆ దృశ్యం చూసి,

'ఏమిటే శశీ? అమ్మకేమైంది' ఖంగారు పడుతూ దగ్గరకొచ్చి అన్నాడు

'ఎవరో సబిన్స్పెక్టరుట ఫోన్‌లో అమ్మకేదో చెప్పాడు. అది వింటూనే అమ్మ ఇలా అయింది' ఏడుస్తూ అన్నది శశ్యాణి.

శ్రీధర్‌కు ఏమీ తోచలేదు—ఏంచేయాలో తెలీక అలా పిచ్చిగా తల్లి దగ్గర కూచున్నాడు. 'ఫోన్‌వే', రామనాధంగారు ఈ సమయంలో ఇంట్లో వుండరు, నాన్నగారు ఇంకా రాలేదు, ఏం చేద్దామా అని ఆలోచించసాగేడు. అంతలో కొద్దిగా తేరుకున్న ఇందిర మెల్లిగా కళ్ళు విప్పి చూసింది.

'ఏమిటే అమ్మా, ఎందుకిలా అయావు?' ఏడుపు గొంతుతో పిల్లలు అంటూంటే— ఇందిర కళ్ళల్లో నీళ్లు తిరిగేయి.

'మీ నాన్నగారికి ఏక్సిడెంటు అయిందిట, జనరల్ ఆస్పత్రిలో వున్నారుట. మనం త్వరగా వెళ్లాలి నాయనా' గొంతు పెగుల్చుకుని ఎల్లాగో అన్నది ఇందిర

శ్రీధర్ టాక్సీకోసం పరిగెట్టేడు.

వీరు ఆస్పత్రి చేరేసరికి రాఘవ్ వాకిట్లోనే ఎదురై—దగ్గిరగా వచ్చి—

'ఇందిరగారూ — ఖంగారు పడకండి — ప్రమాదం ఏమీ లేదు ఇప్పటికి అదృష్టవంతులమే-తలకు మాత్రమే దెబ్బ తగిలింది. ఆపరేషన్ చేస్తున్నారు' అని నెమ్మదిగా మాట్లాడుతూ లోపలకు తీసుకు వెళ్ళేడు.

ఆపరేషన్ ధియేటరు ముందున్న వరండాలో బల్లమీద నిశ్చేష్టతన్యంగా కూచున్నారు—ఇందిరా, శ్రీధరు. మిగత పిల్లలు బిక్క మొహాలతో దిక్కులు చూస్తున్నారు. రాఘవ్ శ్రీధర్ భుజం మీద చేయివేసి ధైర్యం చెప్తూ … మాట్లాడు కున్నారు ఎవరూ వినే స్థితిలో లేరు

దాదాపు ఆరు గంటల తరువాత ధియేటరు తలుపులు తెరుచుకున్నాయి.

చేతులు తుడుచుకుంటూ బైటకువచ్చిన డాక్టర్ల వంక, కన్నీటితో మలినమైన ముఖమెత్తి ఆదుర్దాగా,

'బాబూ, డాక్టరుగారూ ?' చేతులు జోడించింది ఇందిర.

'అమ్మా, ప్రమాదం గడిచినట్లే, ఖంగారుపడకండి, మెదడుకు కాస్త మోస్తరు దెబ్బ తగిలింది. స్పృహరావటానికి కొన్ని రోజులు పట్టవచ్చు. మీ రేమీ అధైర్యపడవద్దు' దగ్గరగా వచ్చి అన్నాడు డాక్టరు.

'మిస్టర్ రాఘవ్—ఆపరేషన్ సక్సెస్‌ఫుల్—ప్రమాదం గడిచింది. మీరు రోగిని కనిపెట్టుకుని దగ్గిరే వుండాలి. ఏ క్షణంలో నైనా స్పృహ వచ్చినా రావచ్చును. వెంటనే నాకు తెలియచేయాలి— రోగికి ఏ మాత్రం



# చరితార్థులు

దలాయకూడదు !' తనే రాఘవ్‌కు చెప్పి ప్రొఫెసర్స్‌వేపు తిరిగి రమణ తీసుకో వల్సిన జాగ్రత్తలు-ఇవ్వవల్సిన ఇంజక్షన్లు వివరించి మరోవార్డువేపు వెళ్ళేడు డాక్టరు. అతని అసిస్టెంట్సు కొంత సేపటి తరువాత రమణను స్ట్రెచర్‌మీద తీసుకొచ్చి స్పెషల్ రూమ్‌లో బెడ్‌మీద పడుకోబెట్టేరు.

తలంతా బాండేజీతో — స్పృహలేకుండా వరున్న రమణను చూసి గొంతులో దుఃఖం సుళ్ళు తిరుగుతూంటే పైట చెంగు నోటి కడ్డం పెట్టుకుని బలవంతాన ఏడుపు ఆపుకుంటూ — జలపాతాలైన కళ్ళు తుడుచుకునే శక్తిలేక పిచ్చిగా చూస్తూ రమణ మంచం దగ్గిర నిలబడింది ఇందిర. తల్లినీ-తండ్రినీ అయోమయంగా మార్చి మార్చి చూస్తూ ఏడుపు దిగమింగలేక చిన్నగా వెక్కుతూ నిలబడ్డారు పిల్లలు మంచం చుట్టూ.

రాఘవ్‌కికూడా చింతతో బాధగా వున్నది. స్నేహితుణ్ణి ఆస్థితిలో చూడలేక పోతు న్నాడు. అయినా మగవాడు కనక బాధంతా గుండెల్లో అదిమిపెట్టి—గంభీరాన్ని తెచ్చి పెట్టుకుని.

'ఇందిరగారూ, మీరిలా అధైర్యపడితే ఎలా చెప్పండి ? డాక్టర్లు ప్రమాదం లేదన్నారు. మీరు కాస్త మనస్సు నిలవ రించుకోవాలి, మీరే ఇలా అయితే పిల్లల్ని చూసేదెవరు ? నేను వుంటాను ఇక్కడ, మీకేమీ భయంలేదు. మీరు ఇంటికివెళ్ళి పిల్లలకు భోజనాలు అవీ చూస్తే'...

'వూ...హూ నేను వెళ్ళను.' ఖండారుగా తలూపింది ఇందిర బాధగా.

'మాకసలు ఆకలిలేదు మేము ఇంటి కెళ్ళము' అన్నారు పిల్లలంతా ఏకకంఠంతో.

అంతలో రామనాధంగారు—వారి భార్యా వచ్చారు.

'ఏమిటమ్మా, మన రమణకు ఏక్సి డెంటు అయిందిట, మాకిప్పుడే తెల్సింది. విల్చున్నపళంగా వచ్చేశాం—ఎంతపని జరి గింది ? ఎంతపని జరిగింది' ఆత్రంగా అన్నారు ఇద్దరూ.

'ఇవాళ లేచినవేళ పిన్నిగారూ !' బావురు మన్నది ఇందిర.

'వూరుకోమ్మా వూరుకో. ఇప్పటికి అదృష్టవంతులమే, ఈ మాత్రంతో ప్రమాదం గడిచింది. భగవంతుడు చల్లగా చూస్తాడమ్మా రమణ కేమీ కాదు, నాలుగు రోజుల్లో నవ్వుతూ ఇంటికి వస్తాడు. నువ్వు ధైర్యం తెచ్చుకోతల్లీ,' ఇందిర భుజంమీద చేయివేసి ఆదరంగా అన్నారాయన

రామనాధంగారు రమణ చేయందుకుని పల్సుచూసి తృప్తిగా తలపంకించారు.

'ఫరవాలేదమ్మా ! అంతా సరిగానే వున్నది, వంటిమీద మరెక్కడా గాయాలు లేవు. తలకు తగిలినదెబ్బ కాస్త మోస్తై నదే కావచ్చు, అయినా వారాఎకల్లా తగ్గి పోతుంది. నేను డాక్టర్లతో మాట్లాడు తాను. నువ్వు బెంగపడకమ్మా !' అంటూ, ఇతనెవరు ? అన్నట్టు రాఘవ్ వేపు చూశారు.

'నేను — రమణ స్నేహితుడనండీ, నాపేరు రాఘవ్. ఇక్కడే సబిన్స్పెక్టరు పోస్టులో వున్నాను. ఇవ్వాళ డ్యూటీలేదు, ఏదో పనిమీద మౌంటురోడ్డు కెళ్ళేను, ఏక్సిడెంటు అయిందని రోడ్డు మధ్యగా జనం గుమిగూడేరు. వెళ్ళి చూద్దుమరదా ! వీడు. లారీ మోటార్బైకును గుద్దేసింది. ఎగిరి అంతదూరాన పడ్డాడుట రమణ. ఫుట్ పాత్‌కు తల బలంగా కొట్టుకుని స్పృహ పోయింది. వెంటనే నాజీప్‌లోనే హాస్పిట ల్‌కు తీసుకు వచ్చాను' వివరించాడు రాఘవ్.

'ఎంత అదృష్టం ? సమయానికి నువ్వు చూశావు కనక సరిపోయింది. లేక పోతే ఇంత మహానగరంలో ఈ వార్త ఇంటికి చేరేసరికి ఎంతటైము గడిచేదో. అందుకే మంచివాళ్ళను భగవంతుడు ఒక కంటకని పెడుతూ వుంటాడంటారు, అది నిజంబాబూ, భగవంతుడే నిన్ను పంపి నట్టు వచ్చి ఆదుకున్నావు' అన్నారు రామ నాధంగారు అతణ్ణి ప్రశంశిస్తూ.

'అబ్బే ఇందులో నేను చేసింది ఏమున్న దండీ. రమణ నాస్నేహితుడేగా, ఇలాటి సమ యాల్లో ఎవరైనా సహాయం చేస్తారు, ఆపదలో వున్నవారికి-అందునా స్నేహితు నికి చేయటం అదీ గొప్పేనా ?' అన్నాడు రాఘవ్.

'అది నీ మంచితనం బాబూ, సరే... సరే'—'అమ్మాయ్ ఇందిరా చాలా రాత్రి యింది, మరి పిల్లలకు అన్నాలు అవీ చూడొద్దా ?'

'ఇప్పుడేమి తింటారులెండి, కాస్త కాఫీత్రాగి పడుకుంటారు. అయినా నోటికి మెతుకు దిక్కుతుందా ఏమన్నానా ? పిల్లలు ఇక్కడ పడుకోవచ్చునేమో కాస్త



కనుక్కుంటే చాలు బాబాయిగారు. ఎలాగో ఈ రాత్రి గడుపుతాము. తెల్లారేక చూసుకోవచ్చు' అన్నది ఇందిర.

'అదేమిటమ్మా, పిల్లల్ని వస్తువనుకో పెడ్తానంటావు మంచిదానివే — అసలిలాటప్పుడు వస్తూ ఉండరాదు తెల్సా— ఎలాగో కాస్త గొంతులో వేసుకోవాలి. ఈ నాలుగు రోజులు పిల్లలు మా ఇంట్లోనే వుంటారు. నీకు క్యారియర్ పంపే ఏర్పాటు చేస్తాము, నువ్వు కాదనకు నేను రోజూవచ్చి చూస్తుంటాను' అన్నది రామనాథంగారి భార్య.

'అదవమ్మా ఇందిరా ఈ ఏర్పాటు బావున్నది. పిల్లలు ఇబ్బందిపడరు, నీకూ కాస్త మనస్సు కుదురుకుంటుంది' అన్నారు రామనాథంగారు.

'వద్దండీ, నేను మా అమ్మకు తోడుగా ఇక్కడే వుంటాను. మా శచికి వంట చేయటం వచ్చును. మీకెందుకు శ్రమ. అది చూసుకుంటుందిలెండి' అన్నాడు శ్రీధర్ వినయంగా.

'అబ్బో, గట్టివాడివేనోయ్, ఫర్వేదు పైకొస్తావు. చిన్నవాడివి నీకు తెలీదుగాని నేను చెప్పినట్లు విను. అమ్మకు సాయంగా నువ్వు ఇక్కడేవుండు. ఈ దగ్గర్లో హోటల్లో ఏమన్నా దొరికితే తెచ్చుకుని ఈపూటకు ఎలాగో కానివ్వండి. మిగతా పిల్లల్ని మాతో తీసుకెళ్తాము రేపట్నుంచీ నాలుగు రోజులపాటు నువ్వు ఇంటికొచ్చి తిని, అమ్మకు క్యారియర్ తీసుకెళ్దువుగాని— ఈలోపుగా నాన్నకు తగ్గి ఇంటికే రావచ్చు—అది మన అదృష్టం— అప్పటిదాకా నాన్నను జాగ్రత్తగా కనిపెట్టుకుని వుండండి' అని శ్రీధర్‌కు చెప్పి.

'అన్నట్లు శిరీష్ ఏదమ్మా' అన్నారు ఇందిరతో రామనాథంగారు.

'స్నేహితురాలి పెళ్ళికి గుంటూరు వెళ్ళిందండీ—ఇవాళో రేపో రావచ్చును'

'మరి మేము వెళ్తాము. అమ్మాయ్ జాగ్రత్త—'

'ఏమోయ్ రాఘవ్ నీవూవచ్చి చూస్తూనే వుంటావుగా' అని పిల్లల్ని వెంటబెట్టుకుని వాకిలిదాకా వెళ్ళి—ఏదో జ్ఞాపకి వచ్చినట్లు— తి—వెనక్కువచ్చి,

'అన్నట్లు మరిచాను. మీవాళ్ళ కెవరికన్నా తెలియపర్చారా, గనుక తమ్ముళ్ళకు వైరిస్తే—వాళ్ళెవరన్నావస్తే నీకు కాస్త ధైర్యంగా వుంటుంది. ఇంతయినా మేము పరాయివాళ్ళమే గదా!'

'ఆహా... అలా అనకండి బాబాయిగారూ, మాకోసం ఇంతగా శ్రమపడుతున్నారు మీకన్నా ఆప్తులెవరు చెప్పండి? మీరు, పిన్నిగారు ఎదురుగుండా నిలబడ్తే చాలు—

# చరితార్థులు

ఆదే మాకెంతో ధైర్యాన్ని కలిగిస్తుంది. మీరు పరాయివారని మేము ఎప్పుడూ అనుకోలేదు. అయినా రేపు మామరదులకూ వైరిద్దాంలెండి మా అన్నయ్య – అక్కయ్యలు ఎక్కడో దూరానవున్నారు. వస్తే వారితమ్ముళ్లే రావాలి. రేపు శ్రీధర్ ఇంటి కొచ్చి ఎడ్రసులు తీసుకుని వెళ్లి ఇస్తాడు లెండి' అన్నది ఇందిర.

రామనాథంగారు, భార్యా — ఇందిరకు మరోసారి ధైర్యంచెప్పి, పిల్లల్ని తీసుకు వెళ్లేరు.

రాఘవ్ మాత్రం ఆ రాత్రి అక్కడే వున్నాడు రెండురోజుల తరువాత శిరి వచ్చింది పూరికండి. అన్నగార్ని ఆ స్థితిలో చూసి తల్లడిల్లి పోయింది. ఇందిరను కావలించుకుని పసిపిల్లలాగా ఏడ్చింది ఇందిరే ఆ అమ్మాయిని వోదార్చాల్సి వచ్చింది. కాస్త తేరుకున్న శిరి అన్నగారి స్థితినిగురించి డాక్టర్లతో మాట్లాడింది. మెడికల్ స్టూడెంటు అని తెలిసి డాక్టర్లు రమణ స్థితిగతులు వివరంగా చెప్పేరు శిరికి. అప్పటికి శిరికి కాస్త ధైర్యం కలిగింది.

వారంరోజులు గడిచినా రమణకు స్పృహ రాలేదు, డాక్టర్లు వారి ప్రయత్నం వారు చేస్తూనే వున్నారు. రమణ అక్కచెల్లెళ్లకు —తమ్ముళ్లకు వైర్లు వెళ్లాయి; అందరూ తలోకారణం చూపి — బోలెడు సానుభూతి వలకబోస్తూ — రాలేనందుకు విచారం వెలిబుచ్చుతూ ఉత్తరాలు రాశారు. చివరి తమ్ముడు మాత్రం వొచ్చి ఒక్క రోజుండి శలవులేదని వెళ్ళిపోయాడు.

రోజు రోజుకూ ఇందిర ధైర్యం దిగజారిపోయి—కాంతిహీనమైన గాజు కళ్లతో దిగాలుగా రమణ వంక చూస్తూ కూచునేది. ఎవరన్నా పలకరించినా బాహ్యస్మృతి లేనట్టే, ఏదో లోకంనుండి మాట్లాడుతున్నట్లు, అర్థహీనమైన జవాబు లిచ్చేది. పదిసార్లు బ్రతిమలాడగా ఒక్క పూట నాలుగు మెతుకులు గొంతులో వేసుకునేది. రాత్రులు కాస్సేపు కూడా వెన్ను వాల్చుకునేది కాదు. రమణ మంచం దగ్గిర వాలు కుర్చీలో కూర్చుని — ఎప్పుడు రమణకు స్మృతి వచ్చి తనని పలకరిస్తాడా! అని కళ్లు విప్పుకుని ఆత్రంగా చూస్తూ కూచునేది.

శిరికి ఇందిర ఈ ధోరణి చూసి భయం వేసింది. ఏలా ఆమెను వోదార్చాలో తెల్చేది కాదు. పిల్లలందర్లోకి శ్రీధరే పెద్దవాడు. అయినా మైనరువెళ్లని కుర్రాడు. అతడే దిగులుపడుతూంటే అమ్మకేమని ధైర్యం కలిగిస్తాడు? పిల్లలంతా పిచ్చివాలకం పడి బెంగటిల్లిపోయారు.

రామనాథంగారూ – భార్యా రోజూ వచ్చి చూచిపోయేవారు. రాఘవ డ్యూటీ అయిపోయాక మిగతా టైమంతా ఆస్పత్రిలోనే వుండేవాడు ఎవరుండి మాత్రం ఏం చేయగలరు?

నెల రోజులు గడిచాయి. రమణకు తెలివి రాలేదు. ఇందిర స్థితి మెంటల్‌గా దిగజారిపోతూంది.

రమణ సంగతి డాక్టర్లు చూస్తారు, మరి ఇందిర మాట!

ఆమెకు జబ్బులైనా రెవరన్నా దగ్గిరుండి, ఆమె తేరుకునేట్లు చూడాలి లేకపోతే ముందీమెను మెంటల్ ఆస్పత్రిలో చేర్చాలేమోనని శిరిష్ భయపడింది. ఆమాటే డాక్టర్లు అన్నారు—

రమణకు కాస్త ఆలస్యమయినా-తప్పక బాగవుతుంది— ముందీమె సంగతి చూడాలి అన్నారు అంతా.

శిరికో ఆలోచన వచ్చింది.

'వదినా నీ ఫ్రెండ్ సుమతివాళ్లకు వ్రాయమన్నావా?' అన్నది ఇందిరతో

అంతటి అయోమయస్థితిలోనూ సుమతి పేరు వినేసరికి ఇందిర కళ్లు మెరిసాయి.

మర్నాడే శేఖర్‌కు వైరు వెళ్ళింది.

మూడోనాటికల్లా శేఖర్—సుమతి పరిగెత్తుకు వచ్చారు.

వారు రావటానికి పది నిమిషాలు ముందుగానే రమణకు కొద్దిగా తెలివి వచ్చింది. రెండు నిమిషాలు అటూ-ఇటూ అర్థంలేని చూపులు చూసి మళ్ళీ కళ్లు మూసుకున్నాడు. స్టాఫ్ నర్సు రమణకు తెలివి వచ్చిన సంగతి డాక్టర్‌కు ఫోను చేసి చెప్పింది.

వెంటనే డాక్టరు హడావుడిగా వచ్చాడు. మళ్లీ తెలివి వస్తుందేమోనని రమణ మొహంలోకి వంగి చూస్తున్నారు అంతా,

శేఖర్—సుమతి వాళ్లు వచ్చేసరికి ఇలా వున్న వాతావరణం చూసి వాళ్లు హడలిపోయారు.

శేఖర్ వస్తూనే రమణ మీద వాలిపోయి 'ఒరేయ్ రమణా, నేను చచ్చిపోయాననుకున్నారా—నీకంత ప్రమాదం జరిగి, ఈ స్థితిలోవుంటే ఇప్పుడా నాకు తెలిసేది' అని పసివాడిలాగా రోదించాడు.

'మిస్టర్, మీరలా గొడవ చేయకూడదు, ఇప్పుడిప్పుడే ఈయనకు స్మృతి వస్తోంది. మీరిలా గొడవ పెడ్తే ప్రమాదం. ఏమాత్రం అలజడి కూడదు. సైలెన్సు ప్లీజ్' అని డాక్టరు, నర్సులు శేఖర్ని ఇవతలకు పిల్చి మందలించేరు. రుమాలుతో కళ్ళు తుడుచుకుని, రమణ చేయి నిమురుతూ, మంచం దగ్గిర కుర్చీలో కూచున్నాడు శేఖర్.

సుమతి ఇందిర చేయి తన చేతిలోకి తీసుకుని 'అక్కా?' అని మాత్రమే అనగలిగింది. సుమతి అనురాగపూర్ణమైన మనస్సు నుండి వెలువడిన ఒక్క మాటా ఇందిర అంతరంగాన ప్రతిధ్వనించి – దుస్సహమైన బాధానికలు తొలగి-మనస్సు తేలికవడి— వేయి ఏనుగుల బలం కలిగినట్లు రిలీఫ్ పొందిన ఇందిర, సుమతి వొడిలో తల పెట్టుకుని-'సుమా, నేను ఏమైపోవాలి? మీ అన్నగారు ఎలా వున్నారో చూశావా?' అని కళ్ళ నీరు నింపుకున్నది

'అక్కయ్యా! నీ ధైర్యమే అన్నగారికి ఆరోగ్యం చేకూర్చుతుంది. నువ్విలా ఏడవకూడదు. లేచి కూచోమ్మా' ఇందిర కళ్లు కొంగుతో అద్ది బలవంతాన కూచోపెట్టి కబుర్లలో దింపింది సుమతి.

పదిహేను రోజుల్నుండి పిచ్చి చూపులు చూస్తూ— గొణుక్కుంటూ-ఏదో లోకంలో వున్నట్లుగా వుండిన ఇందిర సుమతి రాకతో కాస్త తేరుకుని మామూలు మనిషికావటం, శిరీష్‌కు, మిగతావారికీ కూడా ఎంతో ఆశ్చర్యము—సంతోషము కూడా కలిగించింది

సుమతి వాత్సల్యంలో — ఇందిర కాస్త తేరుకుని ధైర్యాన్ని పుంజుకుని — రమణకు పరిచర్యలు చేయసాగింది.

మరునాడు రమణకు మళ్ళీ తెలివి వచ్చింది కాని ఎవరినీ గుర్తించలేక పోతున్నాడు. నాలుగురోజులకు కాస్త మాట్లాడే వోపిక వచ్చింది అయినా అందరి మొఖాల్లోనూ ఏదో వెతుకుతున్నట్టు చూసే వా

వెర్రి చూపులకు అందరూ ఆందోళన పడుతున్నారు. డాక్టర్లు ఏవో ఇంజక్షన్లు మార్చి—మార్చి ఇస్తున్నారు.

ఇందిర పరిస్థితి వర్ణనాతీతం. మొగుడే తనని గుర్తుపట్టలేక 'నువ్వెవరు?' అని అడుగుతూంటే, వేదనా భారంతో గుండె ప్రేలిపోతుంది.

సుమతి ఇందిరను క్షణం వదలకుండా దగ్గిరే వుండేది. శేఖర్ రమణమండి చూపులు తిప్పేవాడు కాదు. అలా వారం రోజులు అతిభారంగా ముందుకు జరిగేయి.

ఇందిరా—పిలలు, అదృష్టవంతులై— డాక్టర్ల కృషి ఫలించి క్రమంగా రమణలో మార్పుకలిగి—మెల్లి మెల్లిగా కోలు కుంటూ అతి కష్టంమీద అందరి ముఖాలు పరిశీలనగా చూసి గుర్తుపట్టి మాట్లాడసాగడు తమ ఇంటి ఇలవేల్పు శ్రీ వేంకటేశ్వరస్వామికి తన పసుపు—కుంకుమలు నిలిపినందుకు—మంగళసూత్రాలతోసహా నిలువుదోపిడి ఇస్తానని ముడుపు కట్టింది ఇందిర.

స్వామి మహాత్మ్యమొ—ఆమె అదృష్టమొ మరో నెలరోజులకల్లా రమణకు పూర్తి స్వస్థతకలిగి, హాస్పిటల్‌నుండి డిశ్చార్జి అయ్యాడు రమణ ఆస్పటల్‌లో దాదాపు మూడునెలలు పైగా వున్నాడు. రెండు నెలలుగా సుమతీ—శేఖర్, రమణ దగ్గిరే వుండి — వారుచేసినసేవా — చూపించిన ఆప్యాయతా మాటల్లో ఇమడ్చలేనిది. ఆర్థికంగా కూడా శేఖర్ ఎంతో ఆదుకున్నాడు.

శిరీష్ చదువు నిమిత్తమే—రమణ బ్యాంక్అకౌంట్ దాదాపు తరిగి పోయింది. ఆ మధ్యలరమణ రెండోతమ్ముడు కూతురు పెళ్లికి కట్నం డబ్బు కొరత అయిందంటే నాలుగువేలు తమ్ముడికి పంపేడు పెద్ద చెల్లెలి కొడుకు తమ ఇంట్లోవుండి ఎ. ఏ. చదివిన న్నాళ్లు అడపాదడపా ఫీజులు అవీ కట్టేవాడు. అలా ఖర్చుఅవగా బ్యాంక్‌లో మిగిలింది కొద్దిపాటే.

రమణ ఆస్పత్రిలోవుండగా—ఆ కొద్దిగా నైనా పత్రడా చేసేందుకు రమణసంతకం చేసేస్థితిలో లేడు. ఇందిర తన పేరున బ్యాంక్‌లోవున్న వెయిరూపాయలు డ్రాచేసి ఖర్చుపెట్టింది. తరువాత రామనాథంగారు ఇచ్చిన అయిదువందలు—రాఘవ్ తెచ్చిన మూడువందలు కూడా ఖర్చు అయిపోయి—ఇక నెల్లాగా అన్నస్థితిలో, శేఖర్ దేముడల్లే వచ్చి ఆదుకున్నాడు. అతని చేతిడబ్బు వేయికిపైగా ఖర్చువేశాడు శేఖర్ రమణ నిమిత్తం.

ఎంతఖర్చులు అయితేనేం అందరిశ్రమా ఫలించి రమణ ఆరోగ్యవంతుడయ్యాడు అదే అందరికన్నా ఆనందం నింపింది.

రమణ ఇంటికివచ్చి కాస్త అటూ—ఇటూ తిరగ్గలిగే ఓపిక గలిగేంతవరకు ఒక పదిరోజులు వారింటనేవుండి. తిరుగు ప్రయాణమయ్యారు సుమతి—శేఖర్.

కష్టసమయంలో వారుచేసిన సహాయానికి—చూపిన అభిమానానికి — రమణ—ఇందిరలు చెమర్చిన కళ్లతో సుమతి, శేఖర్లకు కృతజ్ఞత చెప్పుతున్నారు నిండు మనస్సుతో—

ఆరువందల రూపాయలచెక్కు శేఖర్ చేత పెట్టి, ఇప్పటికి ఇదివుంచు—మిగతాది మెల్లిగా ఇస్తాను' అన్నాడు రమణ. శేఖర్ మొదట తెల్లబోయాడు అర్థంకాక—తరువాత కళ్లు కోపంతో ఎర్రబడ్డాయి:

'రమణా ఏమిట్రా మవ్వనేది? నేను అప్పుగా ఇచ్చానని ఎవడ్రా అన్నది? తెలివికి సంతోషించాలే — ఇక నెప్పుడూ అలా అనకు' అన్నాడు.

'అన్నగారూ! మీరలా కోపం తెచ్చుకో వద్దు. ఆపదలో భగవంతుడల్లేవచ్చి ఆదుకున్నారు. మీరుచేసిన సహాయానికి—ఏమిచ్చి మీరుణం తీర్చుకోలేం, ఇంకా డబ్బు రుణం కూడా వుంచుకోమనటం మీకు భావ్యం కాదు. మీదే మీకు ఇస్తున్నాం—ఇంతగా అభిమానపడడం ఎందుకు? తీసుకోండి అన్నగారూ' ఇందిర బ్రతిమలాడుతూ అన్నది.

'అక్కయ్యా, నువ్వు మమ్మల్నింత పరాయివారుగా చూస్తావనుకోలేదు. మనలో మనం ఈమాత్రం సహాయం చేసుకోడం—అదీ ఘనకార్యమే? వేలూ—లక్షలు కాదు, ఈ కొద్దిపాటికే — అప్పులూ — రుణాలు అంత పెద్దమాట లెమిటమ్మా! వద్దు అక్కయ్యా—మనలో ఇలా భేదాలు చూడకు' ఇందిరచేయి పట్టుకుని అన్నది సుమతి.









ఏదయినా అభియోగం విచారించవలసి వచ్చినప్పుడు ఏం చేస్తామంటే — మనం చెప్పే దానికి బలాన్ని కూర్చే సాక్షులను కోర్టుకు తీసుకువెళతాము, తనకు రావడానికి అవకాశం లేదని వారు చెప్తూ ఉన్నా ప్రాధేయపడి, భత్యాఖర్చులు కూడా ఇస్తాము. అలా ఇవ్వడానికి కోర్టు అనుమతిని ఇస్తుంది. ఇదే విధంగా ప్రతివాది కూడా. తన వాదానికి అనుకూలంగా సాక్షులను న్యాయస్థానంలో హాజరుపెడతాడు. ఇరుపక్షాల న్యాయవాదులూ తమ తమ పార్టీల పక్షాన వాదిస్తారు. వారు వాదించే వాట్లోనూ, సాక్షులు చెప్పేవాట్లోనూ ఉండే సత్యాసత్యాలు నిర్ణయించడం సులభమేమీ కాదు. ఇది అందరికీ తెలిసినదే!

మానవుడు రెండవ కంటివానికి తెలియకుండా ఏవైనా పనులు చేసి, అవి ఎవ్వరికీ తెలియవని భ్రాంతి పడవచ్చు మనం కోరకపోయినా— ఆ పనులను కనిపెట్టి సాక్షిభూతులైనవారు లేకపోలేదు మొదట్లో తన అంతరాత్మకే తెలుస్తుంది. అదేకాకుండా ఆ పనికి సాక్ష్యం ఇచ్చే మరికొన్ని ఉన్నాయి. అవి—

'ఆదిత్యచంద్రా వనలోఽనిలశ్చ
ద్యౌర్భూమిరాపో హృదయం యమశ్చ
అహశ్చ రాత్రిశ్చ ఉభే చ సంధ్యే
ధర్మశ్చ జానాతి నరస్య వృత్తమ్.'

అనే శ్లోకంలో చెప్పబడి ఉన్నవి.

మానవుని ప్రవర్తన ఎలా ఉన్నా— అతడు ఎంత దాచినా అతని ఆత్మకు తెలియక తప్పదు ఆ విధంగానే ఆ ప్రవర్తనను సూర్యుడు చంద్రుడు వాయువు, అగ్ని, ఆకాశం, భూమి, నీరు, యముడు, పగలు, రాత్రి, ఉదయకాలం, సాయంకాలం, ధర్మము కనిపెట్టుతునే ఉంటాయి. ఈ విధంగా పద్నాలుగు సాక్ష్యములూ ఉండగా, తాను చేసినది ఎవ్వరికీ తెలియదనుకోవడం పొరపాటు ఈ విషయాన్నే శకుంతల 'నిన్ను నేను వివాహమాడలేదు' అని నిండుసభలో చెప్పిన దుష్యంతుని గురించి 'పురుష వృత్త మెరుంగుచునుండు జావె వేదములును పంచభూతములు ధర్మువు సంధ్యలు నంతరాత్మయున్, యముడును చంద్ర సూర్యులు నహంబును రాత్రియు నన్ పదార్థము లివి యుండగా నెరుడు దక్కొను వేర్పునె తన్ను ముచ్చిలన్' అని పలికింది. ఆమె చెప్పిన సాక్షులలో కొంత మార్పు ఉండవచ్చును. కాని సాక్ష్యం ఇవ్వడంలో భేదం లేదు.

మానవుడు ఏది చేసినా ముఖ్యంగా తన అంతరాత్మ బాగా తెలుసుకుంటున్న సంగతి మరచిపోకూడదు. ●

# చరితార్థులు

'అవునమ్మా — చెల్లాయ్, కష్టంలో సహాయపడటం — అప్పులపేరిట పనులు చేసుకోటానికేనా? డబ్బుతో ఆప్యాయతలు కొనుక్కుంటామటమ్మా, అలా అయితే మనస్నేహానికి అర్థమే లేదు నేనంతటి స్వార్థపరుణ్ణి కాలేను — అలా నన్ను మీరంచనా వేసుకోవటం నాకెంతో బాధగా వున్నది. అమ్మా ఇందిరా రమణ నా ప్రాణస్నేహితుడు వాకింత గండంగడిచి బైట పడ్డాడు అది మనకెంతో ఆనందదాయకం ఇలాటి సంతోష సమయంలో నా మనస్సు బాధపెట్టకండి. ముందెప్పుడన్నా - మీ పిల్లల పెళ్ళిళ్ళకో— చదువులకో డబ్బిస్తే— మళ్ళీ తీసుకుంటానుకానీ—ఇప్పటికి మాత్రం ఈ పని నావల్లకాదు. పోనీ ఇంకోమాట చెప్పనా, ఇందిరా, నాకు అక్కాచెల్లెళ్ళు లేరు. ఆలోటు నీవలన తీరుతోంది. అందుకనిఇది- నీ అన్న నీకు పసుపు — కుంకుమలనిమిత్తం' అని చెక్కు ఇందిరకిచ్చాడు శేఖర్ పసుపు కుంకమలకు అని అన్న తరువాత ఇందిర మరి కాదనలేకపోయింది. వారి స్నేహానాత్సల్యానికి— హృదయ ఔన్నత్యానికి అచ్చెరవొందిజోహారులర్పించారు ఇందిరా రమణలు. రమణ శేఖర్ని కావలించుకుని 'నీలాటి మిత్రుణ్ణి పొందగలిగిన నేను అదృష్టవంతుణ్ణి మనస్నేహం ఇలాగే చిరకాలం నిలవాలని కోరుతన్నాను' అన్నాడు సంతోషంగా 'అలా అని మళ్ళీ మళ్ళీ ఏక్సిడెంటుల్లో ఇరుక్కున్నావంటే వూరుకోను రోయ్—కాస్త వొళ్ళు దగ్గిరపెట్టుకుని తిరగటం నేర్చుకో మా చెల్లెలుకోసమన్నా ఆరోగ్యంగా వుండరా రాస్కెల్' అన్నాడు రమణ బుజంమీద గట్టిగా చరిచి శేఖర్, అందరూ ఫక్కున నవ్వేరు.

మూడునెలల నిశ్శబ్దత తరువాత ఆ ఇంటమళ్ళీ వుల్లాసకరమైన వాతావరణం నెలకొన్నది.

(ఇంకా వుంది)

3-8-73




కె కేశవరావు, తణుకు

ఒక సం. క్రింద కుక్కపిల్ల కరచినది. అది ఏదో జబ్బువల్ల, ఇంకా కొంతమందిని కరచి చనిపోయినది. నేనేమీ యిజక్షన్లు చేయించుకోలేదు ఇప్పుడు చేయించుకోవాలా?

• కుక్కకాటు వల్ల వచ్చే 'రేబీస్' అనే రోగం ఒక సం. వరకూ రాకుండా ఉండదు. మీరు ఇంతవరకూ మామూలుగానే ఉన్నారు కాబట్టి, ఇప్పుడు వాక్సిన్ అనవసరం

ఈ వాక్సిన్ కుక్క కరచిన ఒక వారం లోపలే వేయించుకోవటం మొదలుపెట్టాలి. కనీసం 10 ఇంజక్షన్లయినా బొడ్డుచుట్టూ వేయించుకోవాలి

బి జె కారోలిన్ దత్, విశాఖపట్నం

నా భర్తకు గెడ్డంమీద 'బార్బర్స్ ఇచ్' తో బాధ పడుతున్నారు ఎన్నో మందులు, ఆయింట్‌మెంట్లు వాడాము

* 10% కోల్‌టార్ సొల్యూషన్, 2% సాలిసిలిక్ ఆసిడ్, సల్ఫర్, 'హెక్సాక్లోరోఫీన్' — ఈ మందులన్నీ కలిపి ఒక ఆయింట్‌మెంటుగా ప్రయివేటు ఫార్మసీలలో తయారు చేయించండి ఈ మందు రోజుకి రెండు పూటల చొప్పున 15 రోజులు వాడితే పూర్తిగా నయమై, మచ్చలు కూడా కనబడవు పూర్తిగా మానిన తర్వాత 10 రోజులవరకూ ఈ ఆయింట్‌మెంట్ వాడాలి.

టి మాధవరావు, వాగర్‌కర్నూల్

నా 33 వ ఏట కుడివైపు హెర్నియా ఆపరేషన్ జరిగింది దానివల్ల ఇప్పుడు ఇబ్బంది లేదు. గత 10 నెలలుగా ఎడమ వైపు నరం ఉబ్బి బాధ కలుగుతున్నది. నా ప్రస్తుత వయస్సు 55 సం లు. పైల్స్, బ్రాంకైటిస్ ఉన్నవి. ఇప్పుడు ఆపరేషన్ చేయించుకోవచ్చా?

* దగ్గు, జలుబు—మున్నగునవి ఉన్నప్పుడు ఆపరేషన్ చెయ్యరు. ముందర మీరు బ్రాంకైటిస్‌కు వైద్యం చేయించుకోండి. అది తగ్గేవరకూ 'బెల్ట్' ఉపయోగించండి. మలబద్ధకము రాకుండా చూసుకోవటం ముఖ్యం

డి తిరుపతి, మందమారి (ఆదిలాబాద్)

నా వయస్సు 23 సం లు. 1967 లో టి బి. వచ్చింది. వైద్యం చేయించుకొన్నాను ఈ రోగం తిరిగి వస్తుందా? వివాహం చేసుకోవచ్చా? యాంటీ టి బి. వాక్సిన్లు ఎక్కడ లభిస్తాయి?

* క్షయ రోగం వచ్చినప్పుడు పూర్తిగా నయమయ్యే దాకా అంటే వైద్యులు వ్యాధి నయమయింది అని చెప్పేదాకా మందులు వాడాలి ఇలా వాడటం కనీసం 1 సం. కాలంపాటు జరగాలి కొందరికి ఇంకా ఎక్కువ కాలం వాడవలసి వుంటుంది పూర్తిగా నయమైన తర్వాత మామూలుగా జాగ్రత్తలు తీసుకొంటే తిరిగి రావటానికి అవకాశం తక్కువ రోగం నయమయిన తర్వాత తప్పక వివాహం చేసుకోవచ్చును.

బి సి జి. వాక్సిన్, పెద్ద పట్టణాల లోను, కొన్ని ప్రాథమిక వైద్య కేంద్రాల లోను దొరుకుతుంది ఈ రోగం వున్న వారు, తమ పిల్లలకి పుట్టిన రెండవ రోజునే ఈ వాక్సిన్ వేయిస్తే మంచిది

ఎస్ ప్రమీల, రామగుండం.

మనము తినే పదార్థములలో రాళ్ళు మొదలయినవి జీర్ణాశయములోనికి చేరి ఏదైనా హాని కలిగిస్తాయా? వీటికీ, మూత్రకోశములో ఏర్పడే రాళ్ళ (స్టోన్స్)కీ సంబంధము వున్నదా!

* సాధారణంగా ఆహారంతోపాటు జీర్ణకోశములో చేరిన రాళ్ళు మొదలగు పదార్థములు మలములో విసర్జింపబడతాయి అరుదుగా ఈ చిన్నరాళ్ళు అపెండిక్స్‌తో చేరి, అపెండిసైటిస్ ఏర్పడవచ్చును

ఈ రాళ్ళకీ మూత్రకోశము (బ్లాడర్) పిత్తాశయములో ఏర్పడే రాళ్ళకీ సంబంధము లేదు అవి శరీరంలోని ద్రవపదార్థములో రసాయనిక మార్పులవల్ల వస్తాయి.

కె బాలాజి, గుంతకల్.

కొన్ని సం లుగా మలంలో చిన్న తెల్లని క్రిములు పడుతున్నాయి...

* ఈ క్రిములని త్రెడ్ వర్మ్స్ అంటారు వ్యావహారికంగా నులిపురుగులు అని కూడా అంటారు

ఇలా వున్నవారు, పైపెరజీన్ సిట్రేట్ సిరప్ రెండు చెంచాలు రోజూ రాత్రిపూట, ఏడురోజులపాటు తీసుకోవాలి ఎనిమిదవ రోజు విరేచనాలకి మందు తీసుకోవాలి.

తిరిగి రాకుండా వ్యక్తిగత పరిశుభ్రత, పాదరక్షలు ధరించటం (మలవిసర్జన సమయంలో) ఇంట్లో అందరికీ ఒకేసారి ఈ మందు ఇవ్వటం, గోళ్ళు కత్తిరించుకోవటం (తరచూ), మామూలుగా తీసుకోతగిన జాగ్రత్తలు మలవిసర్జన ప్రదేశం పరిశుభ్రంగా వుంచుకోవాలి. సెప్టిక్ టాంక్ లెట్రిన్—వాడితే మంచిది

కె ఉషాదేవి, అనంతపురం

నేను 5 సం,ల నుంచి అతి మూత్ర వ్యాధితో బాధ పడుతున్నాను మూత్రములో గాని, రక్తములో గాని చక్కెర (షుగర్) లేదు.

* ఈ రోగాన్ని డయాబెటిస్ ఇన్సిపిడస్ అంటారు. మామూలుగా వచ్చే చక్కెరవ్యాధిని 'డయాబెటిస్ మెలిటస్' అంటారు ప్రసవ సమయంలో లేక ఇతరత్రా కారణాలవల్ల పిట్యూటరీ గ్రంథి దెబ్బతినటంవల్ల, ఆంటీ డయూరటిక్ హార్మోను (అంటే మూత్ర విసర్జనను అరికట్టేది) ఉత్పత్తి కాకపోవటంవల్ల ఇలా జరుగుతుంది.

వైద్యుల సలహామీద పిట్యూటరీ ఎక్స్‌ట్రాక్ట్ వాడాలి ●



# రెండు కుటుంబాల కథ లేక పెడల్ స్టాల్

"టి.వి. నారాయణరెడ్డి"

■ రంగనాథంగారి యింటిమీది కాకి రామ నాథంగారి యింటిమీద వాలడానికి వీల్లేదు. ఈ విషయం లోకులతోపాటు కాకులకూ బాగా తెలుసు. అందుకే ప్రమాదాన్ని గుర్తించిన కాకులు ఆ రెండిళ్లను పంచుకున్నాయి

రెండిళ్లలోని గోడ గడియారాలు రెండు నిమిషాల తేడాతో ఎనిమిదిగంటలు కొట్టడం ద్వారా తమ యజమానుల వైరుధ్యాన్ని చాటాయి

ఇరుగు పొరుగు రెండిళ్లమీదను కాకులు సమంగ వాలకపోవడానికి, గడియారాలు సమంగ తిరక్కపోవడానికీ వెనుక బలీయమైన కారణం కనపడదు; అయినా రెంటికీ మధ్య లేచిన జైలు గోడవంటి బలీయమైన గోడమాత్రం తగువుతీర్చే పెద్ద మనిషిలా గంభీరంగ నిలబడి రెండు కుటుంబాలని చెరోమార్గం పట్టిస్తోంది !

పరస్పర వైరుధ్యభావాలెన్ని వున్నా ఆ రెండిళ్లకు కొన్ని సామ్యాలు కూడా వున్నాయని గుర్తించకపోవడం పొరపాటు కాకపోదు మరి! ఇంటి యజమానులపేర్లు రంగనాథం, రామనాథంలలో నాథం కామన్‌గా వుండటం, రంగనాథంగారి అబ్బిగాడు భాస్కరం, రామనాథంగారి అమ్మడు సరోజ ఒకే కాలేజీలో చదవడం ఆ సామ్యాల్లో కొన్ని.

ప్రియమైన ప్రక్కింటి గోడ గడియారం ఎనిమిదికొట్టడం విన్న భాస్కరం బద్ధకంగాలేచి పేస్టూ, బ్రష్‌తో పెరట్లోని

షైప్ దగ్గరకి చేరాడు

ప్రక్కింటి సరోజ దర్శనంకోసం గోడకు చేసిన ఏర్పాటులోంచి చూసాడు సరోజ తల దువ్వుకొంటోంది

నల్లటి కేశపాశాలలో చిక్కుకున్న సరోజ అందాలు చిందే ముఖారవిందం మేఘాల చాటున దోబూచులాడే చంద్రబింబంలా కనిపించింది భాస్కరం ఉండబట్టలేక పైకే రాగయుక్తంగా అనేశాడు, 'మబ్బువిడిచిన చంద్రబింబము మగువ చక్కని వదనము'

దాంతో యిటు చూసిన సరోజ భాస్కరానికో చిరు నవ్వు విసిరింది అటువైపే చూస్తూ హుషారుగా పళ్ళు తోమేస్తున్నాడు ఇంతలో రంగనాథంగారు ఏమిటారా! వీడిలో వీడు నవ్వేసుకుంటున్నాడని దగ్గరగా వచ్చారు రహస్యం బయటపడింది 'ఏమిటి నువు చేస్తున్న పని? గద్దించేసరికి భాస్కరం వణికిపోయాడు రంగనాథంగారు అందులోంచి చూసేసరికి సరోజ యిటే చూస్తూ చిలిపిగ నవ్వి వెక్కిరించింది రంగనాథంగారు షాక్ అయి 'భాస్కరం!' గర్జించారు 'ఎప్పట్నుంచీ ఏర్పాటు?'

'నాన్నా అ. ది గోడ కన్నం '

'నోర్మూయ్! ఏదో బుద్ధిగా చదువుకుంటున్నావు కదా అనుకున్నాను ఇవా నువు చేస్తున్న పనులు?! పరాయిపిల్ల, పైగా విరోధుల పిల్లతో సరసాలా?'

ఏం చెప్పాలో తోచక నోటిలో బ్రష్‌తో నిలబడిపోయాడు భాస్కరం ఇంతలో 'ఏం జరిగిందండీ' అంటూ అమ్మా, వెనగ్గా బామ్మా పరుగున వచ్చేసారు

'మీకు తెలియదే వీడు వీడు ' రంగనాథంగారి కోపం తారాస్థాయిలో వుంది బామ్మ వెనక్కి చేరిన భాస్కరానికి అభయమిచ్చింది భాస్కరం బామ్మ,

'ఏదో పసివెధవ తెలిసో తెలియకో చేసుంటాడు దానికింత రాద్ధాంత మేమిటిరా?' అంటూ సాగదీసింది

రంగనాథంగారు గంభీరంగ అనేసారు

'ఇలాంటి పిచ్చివేషాలు నాదగ్గిర సాగవు మళ్ళీ ఆ అమ్మాయి జోలికెళ్ళినా, వూసెత్తినా చూడు విన్నేం చేస్తానో! ఆఁ!' ఒక్కక్షణం ఆగకుండా వెళ్ళిపోయారు రంగనాథంగారు

భాస్కరానికి నెత్తిమీద పిడుగు పడ్డట్టయింది భాస్కరం తల్లి అతన్ని సముదాయిస్తూ

'ఒరేయ్! భాస్కరం! మీ నాన్నగారి కోపం నీకు తెలియంది కాదు లే ముఖం కడుక్కో టిఫిన్ రడీగా వుంది ' అమ్మా, బామ్మా వెళ్ళిపోయారు

భాస్కరం గుండెల్లో గూడ్సుబళ్ళు పరుగెడుతున్నాయి ఈరోజు ఏప్రిల్ ఫస్టు

ఎందర్నో ఏప్రిల్ ఫూల్స్ చేదామని కలలు కని ప్రొద్దుటే యీ సంఘటన జరగడంతో నెంబర్ వన్ ఏప్రిల్ ఫూల్ తానే అనిపించింది భాస్కరానికి

పరాభవం టిఫిన్ తిని, ఉదార్పు కాఫీ త్రాగి భాస్కరం కాలేజికి బయలుదేరాడు అతని మనసు మనసులో లేదు భవిష్యత్తును గురించి తను, సరోజ కన్న కలల స్వరూపం ఎలాగుంటుందోననే ఆలోచన భాస్కరాన్ని వేధిస్తోంది

ఇలాగే ఒక ఏప్రిల్ ఫస్టు శుభదినాన సరోజ తనను ఫూల్ చేయబోయిన సందర్భంలో రెండు మనసులు ఒకటైనాయి

పరస్పర విరుద్ధభావాలు గల రెండు కుటుంబాల పరిధిని దాటి యిద్దరు ప్రేమ సామ్రాజ్యంలో విహరించడానికి నిర్ణయించుకున్నారు

ఈనాడు తమ ప్రేమశకటానికి పెద్ద కుదుపుతో బ్రేకులు పడ్డాయి

పదిగజాల ముందుగ పుస్తకాలతో కాలేజికి వెళుతున్న సరోజను చూసిన భాస్కరం నిరాశా, నిస్పృహల వలయాన్ని ఛేదించుకొని ముందుకు సాగాడు

'సరూ డా ర్లిం గ్ '

సరోజ విసురుగ వెనక్కు తిరిగింది. ఆమె ముఖం ఎప్పటిలా నిర్మలంగాలేదు ఆమె వదనంలో ప్రేమానురాగాలకు బదులు క్రోధావేశాలు తాండవిస్తున్నాయి

ఆమె ముఖంలో వూహించని భావాలను చూసి భాస్కరం నిశ్చేష్టుడయాడు

సరోజ ఒక్కక్షణం తీక్షణంగా చూసి ఒక లెటరును భాస్కర్ ముఖంమీదికి విసిరి ముందుకు కదలిపోయింది

సరోజ ప్రవర్తన భాస్కరానికేమీ అర్థంకాలేదు తనను విడిచిపోతున్న జీవితాశను, ఆశయాన్ని ఎలుగెత్తి పిలుద్దామనుకున్నాడు కాని గొంతు మూగపోయింది వణుకుతున్న చేతులతో లెటరు విప్పాడు

'మిస్టర్ భాస్కరం! ఇంతవరకు నీ తీయని మాటలతో నన్ను మైమరిపించావు నీ కపటప్రేమతో నాకు మత్తెక్కించావు. కాని ఇప్పటికైనా నిజం బైటపడింది.



కాళ్ళూ చేతులూ లేనివారు మనకి దయనీయంగా కన్పిస్తారు ఈ బొమ్మలోని మరాఠీ వ్యక్తి కాళ్ళూ చేతులూ లేనివాడైనా దేనికీ యిబ్బంది పడడు నోటితోనే కాఫీని కప్పులో పోసుకుంటాడు అగ్గిపుల్ల గీచి సిగరెట్ అంటించుకుంటాడు సూదిలో దారం ఎక్కిస్తాడు పలకమీద చక్కటి బొమ్మలు గీస్తాడు నిజంగా నోరుపెట్టుకుని గెలవటం అంటే ఇదే!

( ఫోటో పత్రచిత్రకారుడు శ్రీ సంపత్‌కుమార్ )

రక్షించావు. నీ ప్రేమ నిజమయితే మీ ఫాదర్‌తో ఒక్కమాట ఎందుకు చెప్పలేక పోయావు? అమాత్రం కలేజా లేనివాడికి ప్రేమేమిటి? ఐ హేట్ యూ..'

ఉత్తరం చదివిన భాస్కరానికి కాళ్ల కింద భూమి కదిలిపోయినట్లనిపించింది తనమీద తనకే అసహ్యం కలిగింది ఇన్నాళ్ల సహచర్యంలో సరోజకు తనపై అమాత్రం నమ్మకం కలిగించుకోలేకపోయినందుకు భాస్కరానికి జీవించడంలో అర్థంలేదనిపించింది బ్రతుకు శూన్యమనిపించింది.

రోజూకంటె కాలేజి యువాకెందుకో ఉజ్వలంగా శోభిస్తోంది. విద్యార్థులంతా ఒకరినొకరు ఫూల్ చేసుకొంటూ, ఫూల్స్ అవుతూ సరదాగ ఎంజాయ్ చేస్తున్నారు ఎప్పుడూ సెకండ్ అవర్ అయితేగాని కాలేజి ముఖం చూడని రమణ, ఆనంద్, గోపీలు యీరోజు ఒక గంట ముందుగానే కాలేజికి చేరుకున్నారు

కాలేజికి ఏకైక ప్రేమజంట భాస్కరం సరోజలను యివాళ ఎలాగైన ఫూల్స్‌చేసి ఏడిపించాలని నిర్ణయించింది ఫ్రండ్స్ యూనియన్.

'సరోజ వచ్చేస్తోందిరోయ్!'

మిరపకాయ తిన్న కాకిలా అరిచాడు రామస్వామి.

'గురుడు కనిపించడేం?' ఆనందం సందేహం !

'వెనకాలే వస్తుంటాడు చూడరా' రమణ అభయం ! !

ముడుచుకుపోయిన సరోజ ముఖం చూసేసరికి భాస్కరం మిత్రుల ముఖాలు ప్రశ్నార్థకాలయాయి ! !

'తావిలేని పువ్వా !'

'మజ్నులేని లైలాయా ! !'

'షటప్! స్టావ్ నేస్టీ కామెంట్స్' కసిగ అనేసి విసురుగ వెళ్లిపోయింది సరోజ

షాక్ నుంచి అందరికంటె ముందుగా తేరుకున్న ఆచరి 'ఇది చూస్తుంటే నాకొకటి అనిపిస్తోందిరా' 'ఏ. మిటది' నీలిగాడు రామస్వామి

'మనల్ని ఫూల్స్ చేయడానికి భాస్కరం, వాడి తాలూకూ కలిసి ఏదో ప్లాన్ వేశార్రా !'

'కావచ్చు' ఆనంద్ సపోర్టు చేసాడు.

'కాకపోవచ్చు' అడ్డుతగిలాడు రమణ

# రెండు కుటుంబాల కథ...

'భాస్కరం, సరోజ పోట్లాడుకుంటారు'

'వాళ్లది ట్రూ లవ్‌రా ఫూల్ వాళ్లకి పోట్లాటేమిటి?'

'చూదాం ! గురుడుని రానీండిరా' తాపీగా అన్నాడు గోపి.

ఇంతలో ఒక కుర్రాడు పరుగున వచ్చి 'భాస్కరంగారు. ఈ చీటీని. వారి ఫ్రెండ్స్‌కి. యిమ్మన్నారు' అంటూ లాగూ జేబులోంచి ఒక చీటీతీసి ఎవరి కివ్వాలో తెలియక తికమక పడుతున్నాడు

'భాస్కరం ఫ్రండ్స్ మేమే నాయనా ! యిలా యివ్వు' అంటూ లెటరు లాక్కున్నాడు ఆనంద్

'ప్రియమిత్రులకు భాస్కర్ వ్రాయు అంతిమ లేఖ !' అందరు క్షణం అగిన గుండెల్తో ఒక్కసారిగ ఆనంద్ వైపు జరిగారు.

'నా ప్రాణానికి ప్రాణం నా సరోజ నా ప్రేమను శంకించినాక బ్రతుకులో అర్థం కనిపించక ఆత్మహత్యకు నిర్ణయించుకొన్నాను ఇంతవరకు మీరు నాపై చూపిన ఆదరాభిమానాలకు నా కృతజ్ఞతలు. ఈ లెటరు మీకు చేరేటప్పటికి నేనీ లోకంలో వుండను.

ప్రేమ అనే వ్యూహంలో చిక్కి మీ రెవరు. మీ జీవితాల్ని నాశనం చేసుకోకుంటే అదే నా ఆత్మకు శాంతి! శలవ్!'

ఉత్తరం పూర్తి చేసేసరికి ఆనందానికి కళ్లనీళ్ల పర్యంతమయింది మిగతా మిత్రులంతా హతాశులై వుండిపోయారు మరుక్షణంలో ప్రతి వ్యక్తి ఆవేశ పుద్వేగాలతో వూగిపోయారు

లేడీస్ సెక్రటరీ ఝూన్సీ భాస్కరం లెటరు చూసి నిర్ఘాంతపోయింది. అందరు లేడీస్ వెయిటింగ్ రూం వైపు నడిచారు 'సరోజా' బిగ్గరగా అరిచింది ఝూన్సి. 'ఏమిటది ?' అంటూ లెటరు సరోజ పైకి విసిరింది.

వణుకుతున్న చేతులతో లెటరు చదవ సాగింది సరోజ. సాంతం చదవకుండానే కెవ్వున కేకవేసి ప్రక్కకు వాలిపోయింది. ఉపచర్యల ఫలితంగ యిప్పుడే కొంచెంగా తేరుకొంటోంది. 'చేసింది చాలక యివన్నీ నాటకాలు !' కోపంతో ఆనందం కంఠం రుద్ధమయింది. 'నువు మనిషివేనా ? అని లేంచేసావు చెప్పు !' గోపీ నిలదీసాడు. ఇంతలో జనాన్ని త్రోసుకుంటూ ముందుకు వచ్చిన తెలుగు లెక్చరర్ శర్మగారు గోపీని వారించారు

'ఆమెను యిప్పుడేమీ అడక్కండి'

సరోజ ఫ్రండ్స్ అంతా ఆమెను రకరకాలుగ అనునయిస్తున్నారు

శర్మగారు భరోసా యిస్తున్నారు 'అప్పుడే ఓ నిర్ణయానికి రాకండి అతను మనసు మార్చుకొని తిరిగివచ్చినా రావచ్చు'

'అతని వ్యక్తిత్వం మాకు బాగా తెలుసు... అనుకున్నది ఆచరించక మానడు. ఇది నిజం' అన్నాడు గోపి

ఆ మాటలు విన్న సరోజకు దుఃఖం ఆగలేదు బిగ్గఅగ ఏడ్చేసింది. నళిని, వసంత సరోజను దూరంగ తీసుకుపోయారు

కొంతసేపటికి వాళ్లద్వారా అసలు విషయం తెలిసింది ఏప్రిల్ ఫస్ట్ కదా అని సరోజ భాస్కర్‌ను ఫూల్ చేదామని అతన్ని ద్వేషిస్తూ లెటరు రాసిందట. దాన్ని నిజంగా భావించి భాస్కరం యింత ఘోరానికి తలపడ్డాడు

ఈ విషాద గాథ కాలేజీ అంతటా వ్యాపించిపోయింది. సరోజ పరిస్థితి వర్ణనాతీతం. లెక్చరర్సు, స్టూడెంట్సు అంతా అక్కడికి చేరుకుంటున్నారు.

జరిగింది విని హిస్టరీ లెక్చరర్ సుబ్బారావుగారు నిట్టూర్చారు 'ఇంత దారుణ కృత్యం ఏప్రిల్‌ఫూల్ సందర్భంలో జరగడం హిస్టరీలో యిదే ప్రథమం'

ఇంతలో ప్రిన్సిపాల్‌గారు వచ్చారు జరిగిన దురంతానికి ఆయన చాల కలతపడ్డారు ఆయన భాస్కరం, సరోజల యిళ్లకు కబుర్లు పంపించారు. భాస్కర్‌ంపట్ల సానుభూతిగ శలవు ప్రకటించి, సంతాపసభ ఏర్పాటుచేశారు.

స్టూడెంట్సు, పురప్రముఖులు చాలమంది సంతాపసభకు హాజరయారు. రంగనాథం గారు, రామనాథంగారు కూడ అక్కడకు చేరుకున్నారు, రంగనాథంగారికి దుఃఖం ఆగలేదు.

'దుర్మార్గుడ్ని. ఎప్పుడూ లేంది యివాళ వాడ్ని నానా మాటలూ అన్నాను వాడికి అభిమాన మెక్కువ.. మా బాబు మాకు శాశ్వతంగ దూరమయాడు' అంటూ విల

పించసాగాడు

దుఃఖంలో శత్రువులు కూడ మిత్రులవుతారు రంగనాధంగార్ని చూసేసరికి రామనాధంగారి గుండె తరుక్కుపోయింది కూతురు దురవస్థ చూసి ఆయన కదిలిపోయారు

'చూడండి రంగనాధంగారు! ఇప్పుడెంత బాధపడ్డా లాభంలేదు మన కలతలతో పసివాళ్లను బలిచేసాం, ఆ పాపం మనదే గాయపడి హృదయాలెలా విలపిస్తాయో చూడండి . మాపాప మళ్లీ మనిషవుతుందా? ఆ పాపం మనదే రంగనాధంగారూ మనదే!!'

సంతాపసభ ప్రారంభమయింది ప్రిన్సిపాల్‌గారు మాట్లాడుతూ ఒక ఉత్తమ విద్యార్థి, ఆదర్శ యువకుడు ఇూవిధంగ బలికావడానికి విచారం వెలిబుచ్చారు.

స్టూడెంటు లీడర్ ఆనంద్ మాట్లాడుతూ 'ఇకముందు ఏప్రిల్‌ఫూల్ సాంప్రదాయాన్ని బహిష్కరించాల'ని చెబుతూ సరోజ సరదాకోసం రాసిన ఉత్తరం ఒక, మంచివ్యక్తి ప్రాణాలు బలిగొన్న ఉదంతాన్ని మనం గుణపాఠంగ భావించా ల'న్నాడు అలాగే మరికొందరు ఉపన్యసించారు

తరువాత ప్రిన్సిపాల్‌గారు శలవు ప్రకటించారు. మీటింగు జరుగుతున్నంతసేపూ సరోజ దూరంగ కూర్చొని అంధకార బంధురమైన భవిష్యత్తును ఊహిస్తోంది. తను చేసిన పొరపాటుకు భాస్కర్ బలికావటానికి తీవ్రంగ విలపిస్తోంది. మధ్య మధ్య రామనాధంగారు రంగనాధంగారి భుజంమీద చెయ్యివేసి ధైర్యం చెబుతున్నారు.

సభ ముగిసింది, జాతీయగీతం ఆలాపిస్తున్నారు.

'జనగణ . మన అధినాయక జయహే

భారతభాగ్యవిధాతా . పంజా .'

ప్రిన్సిపాల్‌గారితోసహా స్టేజిపైవున్న అందరి గొంతులు సడన్‌గా ఆగిపోవడంతో అంతా వెనుతిరిగారు కనిపించిన దృశ్యాన్ని చూసి శిలాప్రతిమలైపోయారు భాస్కరం కులాసాగా నడిచివస్తున్నాడు ఆ నిమిషం ఆగి అంతా ఒక్కసారి భాస్కరం! అన్నారు.

'ఏమిటి? ఏం జరిగింది?' తాపీగా అడుగుతున్న భాస్కరాన్ని చూసేసరికి రామస్వామికి మండింది ..

'ఏంలేదు సన్‌తాపసభ!!' నువ్వు పోయావని సన్‌యొక్క తాపానికి అంటే ఎండకు వోర్చి జరిపినసభ' ఇంతలో ఝాన్సీ 'భాస్కర్! సరోజ మిమ్మల్ని ఫూల్ చేయడానికి అలా రాసిందట మీరు అపార్థం చేసుకొని ..'

భాస్కరం తేలిగ్గా నవ్వేశాడు, 'ఆ విషయం నాకు ముందే తెలుసు తిరిగి ఆమెనే ఫూల్‌చేయాలని ఇూ నాటక మాడాను.' అందరు ఘొల్లున నవ్వారు.

'స్టుపిడ్' ప్రిన్సిపాల్ గద్దించారు, 'ఏదో మంచి స్టూడెంట్‌వనుకుంటె యింతతమాషా చేస్తావా? ఎంతమంది నేడిపించావో తెలుసా?'

'క్షమించండి సార్.. ఇంత జరుగుతుందనుకోలేదు'

'తీరా శలవు కూడా ప్రకటించేసాను' ప్రిన్సిపాల్‌గారు విచారం వెలిబుచ్చారు 'ప్రిన్సిపాల్‌గారు కూడా ఏప్రిల్ ఫూలేనురోయ్!' ఎవరో అరిచారు 'తగులడండి' అంటూ ప్రిన్సిపాల్‌గారు తన రూంలోకి పోయారు.

తమందర్ని ఒకేసారి ఫూల్ చేయగలిగినందుకు, శలవిప్పించినందుకు స్టూడెంట్లు భాస్కరాన్ని అభినందిస్తున్నారు

రంగనాధంగారు ప్రశాంతచిత్తంతో జేబులోని చుట్టతీసి రామనాధంగారి నోట్లో పెట్టారు. విచారసాగరంలో మునిగిపోయిన సరోజ యివేమీ గమనించలేదు

భాస్కరం నెమ్మదిగ ఆమెను సమీపించి 'డార్లిం గ్...' అనేసాడు భాస్కరం గొంతువిన్న సరోజ ఒక్కసారిగ లేచి వచ్చి అతని కౌగిలిలో ఒదిగిపోయింది

ఆ దృశ్యాన్ని చూసిన రంగనాధం, రామనాధంగార్లు వెనుదిరిగి ముహూర్తాలు పెట్టించేందుకు పురోహితుడి దగ్గరకు బయలుదేరారు

ఇదంతా చెట్టు మీంచి గమనిస్తున్న రెండు కాకులు హుషారుగ ఎగిరిపోయి ఈ శుభవార్త ఊరంతా ప్రచారం చేసాయి ఆ యింటిమీదకాకులు ఈ యింటిమీద వాలడం మొదలుపెట్టాయి రెండు కుటుంబాలకు కుదిరిన బంధుత్వానికి చిహ్నంగా రెండిళ్లలోని గడియారాలు ఒకేసారి నాలుగుగంటలు కొట్టాయి, ●



# సిమీ బ్యూటీ బులెటిన్

లేక

## అందానికి చిట్కాలు

**అందాల తార సిమీ అందానికి, ఫాషన్‌కి తగిన చిట్కాలు తెలుపుతుంది వ్యక్తిగతమయిన ప్రశ్నలకి సమాధానాలు ఇవ్వలేనని తెలుపటానికి ఆమె చింతిస్తోంది! సాధారణంగా అందరికీ ఉపయోగంగా ఉండే ప్రశ్నలనే 'SIMI'S BEAUTY BULLETIN, Post Bag No 7117, BOMBAY 400014 కి పంపవచ్చు.**

✵ ప్ర. నా గడ్డం పెద్దదిగా వుంటుంది రెండు గడ్డాల్లా అనిపిస్తుంది. గొంతు మీదకూడా కండలున్నాయి ఏం చెయ్యమంటారు?

జ : కాళ్ళ మడతవేసుకుని చేతులు తుంటి మీద వుంచుకుని కూర్చోండి. తల నెమ్మదిగా ముందుకు వంచండి ఎడమవైపుకి కుడివైపుకి తలని తిప్పండి మళ్లీ కుడివైపునుంచి ఎడమకి తిప్పండి. మెడ పట్టకుండా జాగ్రత్తపడుతూ రోజూ చెయ్యండి ఇలా పదిసార్లుచేస్తే కొంత గుణం కనిపిస్తుంది.

ప్ర : నాచర్మంబిరుసుగావుంటుంది. అక్కడక్కడ ఎర్రని మచ్చలున్నా . నారంగు మారాలంటే ఏమన్నా పద్ధతివుందా?

జ : ఎక్కువగా నీళ్ళ తాగుతూ వుండండి. నూనె పదార్థాలు తినడం తగ్గించండి చాక్‌లెట్లు, కేకులూ తినడం మానెయ్యండి. తాజా కూరగాయలు, పళ్ళ తినడం మొదలెట్టండి. మెడికేటెడ్‌సోప్‌తో ముఖం రుద్దుకుని వారానికోసారి బ్యూటీ మాస్క్ వేసుకుంటే మీ సమస్య తీరిపోతుంది.

ప్ర . నావి అంత పొడుగూ అంతకురచా కాని వెంట్రుకలు మంచి హెయిరాయిల్ వాడతాను. శుభ్రంగా వుంచుకుంటాను. అయినా రాలిపోతున్నాయి. చుండ్రు లేదు. నూనె రాసుకునేప్పుడు కూడా చేతిలోకి వెంట్రుకలు వూడి వచ్చేస్తున్నాయి. నా వెంట్రుకలు దట్టంగా పెరగాలంటే ఏం చెయ్యాలి!

జ · మీ వెంట్రుకలు పొడిపొడిగావుండి వుండాలి. రోజూ స్నానంచేస్తే అవి వూడి పోడానికి అవకాశం వుంది. రోజూ కడగడం ఆపెయ్యండి· సబ్బు పెట్టవద్దు. షాంపూని వారానికి ఒకమారు మాత్రమే ఉపయోగించండి ఆల్మండ్ హెయిరాయిల్ ప్రతిరాత్రీ పడుకోబోయేముందు రాసుకోండి. వూడి పోతున్నా భయపడవద్దు వెంట్రుకలు వూడి పోయినా వెంటనే మళ్లి వచ్చేస్తాయి. మాసానికి అరంగుళం పొడవున మీ వెంట్రుకలు పెరుగుతాయని జ్ఞాపకం వుంచుకోండి మూడునాల్గుమాసాల్లో మీ సమస్య తీరిపోతుంది

ప్ర : నాకు కండపట్టాలంటే ఏం చెయ్యాలి

జ · అది చాలా చాలా తేలిక. చాక్‌లెట్లు అయిస్‌క్రీమ్, కేండీ అన్నీ తినండి. అవన్నీ నాకు నిషేధం !



ప్ర : నాకళ్ల చుట్టూ గీతలున్నాయి. వయసు మీరినట్టు చూపించే ఈ మడతల్ని ఎలా పోగొట్టడం?

జ ఒకసారి ఈ మడతలు పడడం ఆరంభిస్తే పోగొట్టడం కష్టం. ఎవరయినా పోగొడతామంటే అది తెలివితక్కువ తనం. మోసపోకండి ఒక్క "మేకప్" ఒకటే తరుణోపాయం. 'వయిట్ ఆయ్‌షాడో' (హాయ్‌లయిటర్) వుపయోగించండి మడతలు కనిపించవు. ముఖంమీద మడతలు కళ్ళ చికిలించడం పెదవులు బిగపట్టడం, ముఖాన్ని బిగపట్టడం లాంటి అలవాట్లవల్ల తొందరగా వస్తాయి. ఈ అలవాట్లని తగ్గించుకోండి.

ప్ర . నాకు చాలా మంచిఆకర్షణీయమైన కళ్ళున్నాయి. కాని నేను కళ్లద్దాలు ధరించడం వల్ల వాటిని ఇతరులు చూసే యోగంలేదు. కళ్లకి మేకప్‌చేసుకోవడమంటే, నాకు ఇష్టమే. కాని అనవసరం అనిపిస్తుంది ఎవరూ చూడనిదానికి మేకప్ ఎందుకూ అనిపిస్తుంది

జ : నువ్వు చాలా అల్లరిపిల్లవు. కళ్లతో ఆకర్షించాలంటే ఒక పద్ధతి వుంది. అద్దాల వెనకవున్న మేకప్‌తో కొట్టొచ్చినట్లు కనిపించేలా చెయ్యవచ్చు. కొంచెం దట్టంగా 'మస్కారా' వెయ్యండి ఫాల్స్‌ఆయ్‌లాషెస్ ఉపయోగించండి. మీరు ఆకర్షించాలనుకున్న యువకుడు కనిపించినప్పుడు అద్దాలు తీసేసి రెప్పలు ఒకసారి టపటప లాడించండి పని జరుగుతుంది···వోకే? ●

# సినిమా

## ఆరు గురి పై ఆరునిమిషాల పాట

'మీనా' చిత్రానికిగాను, దర్శకురాలు విజయనిర్మల వి వి ఎస్ స్టుడియోలో చిత్రీకరించింది కవి దాశరథి కలం అందించిన ఆరునిమిషాల పాట అది, అది అమోఘంగా ఆలాపించినది బాలసుబ్రమణ్యం. స్వరకర్త రమేష్‌నాయుడు

'పెళ్లంటే నూరేళ్ల పంట
అది పండాలి కోరుకున్న మా యింట
బంధాలను తెంచుకుని
బాధ్యతలను పెంచుకుని
అడుగు ముందుకేశావమ్మా
గడపదాటి కదిలేవా'

ఈ పాటను చిత్రంలో కృష్ణ, జగ్గయ్య విజయనిర్మల, చంద్రకళ, గుమ్మడి, ఎస్వరలక్ష్మి గార్లపై (ఆరుగురిపై) పిక్చరైజ్ చెయ్యబడింది.

### వనిత ఘనత

ప్రముఖ నవలా రచయిత్రి విరచితమైన 'మీనా'ను సెల్యులాయిడ్ పైకి ఎక్కించే పటుతర బాధ్యతను విజయనిర్మల చేపట్టింది మూలకథకు భంగం రానీకుండా, కథాపాత్రలను కుదించకుండా, సినిమా స్క్రిప్టును చక్కగా తయారు చేసుకుంది ఆమె అప్పలాచార్య చేత అందమైన సంభాషణలను రాయించుకుంది అతగాడు నవలను ఆమూలాగ్రంగా చదివి, అసాధారణంగా రచన చేసి యివ్వడం జరిగింది అతడి మాటలను విన్నప్పుడు, ఎంత ఘాటుగా, ఎంత స్వీటుగా రాయగల డీతడు అనిపించింది పదివేల అడుగుల రష్ చూచి విమర్శకులు విజయనిర్మల దర్శకత్వాన్ని వెరివెరి గుడ్ అని ప్రశంసించారు 'మీనా' పాత్రను ఒక ప్రెస్టీజ్‌గా తీసుకొని ప్రతిభావంతంగా పోషిస్తున్నట్టు, చెపుతున్నారు ఈ వనితకు ఘనత చేకూరుస్తుంది 'మీనా' చిత్రం అంటున్నారు పి వి రమణయ్య అదృష్టవంతుడు ఒక మంచి చిత్రాన్ని అందిస్తున్నాడు

## నవ్వాలి, నవ్వాలి

నవ్వాలి, నవ్వుల్లో బ్రతుకంతా గడపాలి కన్నీళ్లొచ్చేదాకా నవ్వాలి, ఈ నవ్వులతో విధిని కూడా గెలవాలి' అంటూ మధుర గాయని సుశీల ప్రసాద్ థియేటర్లో పాడింది 'అరంగేట్రం', తెలుగు చిత్రానికి ఆమె పాడుతూ వుంటే, కోటిరాగాలు ధ్వనించాయి మధురానుభూతిని కలిగించిన అంత మంచి పాటకు రాజశ్రీ సాహిత్యం, రాజేశ్వరరావు సంగీతం పోటీ పడ్డాయి

### మణి మంగళం

మదరాసుకు సమీపాన వెలసిన గ్రామం యిది. ప్రకృతి రామణీయకతకు నిలయం యిది ఇది 'నవ్వాలి' పాటకు లొకేషన్ అయింది ఆ పాటను కథానాయిక ప్రమీలపై చిత్రీకరించడం, జరిగింది

### ప్రమీల తెలుగు ..

'అరంగేట్రం' తమిళంలో నాయికగా నటించిన ప్రమీలకు, ఆ చిత్రం విడుదల అయిన వారం రోజుల్లో వచ్చిన ఆఫర్లు ఒకటా, రెండా వ్రాయడానికి అదే సమయం అనుకుని, అన్నిటినీ ఒప్పుకుందా ఆవిడ? అక్కడే చాలా జాగ్రత్త వహించింది తనకు ప్రేక్షకు లిచ్చిన పేరును పది కాలాలపాటు పదిలపరచుకుంది అందుకే మంచివాటిని అంగీకరించింది

'తెలుగుబాష రాదు ఆమెకు కానీ ఆ భాషను నేర్చుకోవాలి, తెలుగు డిక్షన్



'మైనరుబాబు'లో శోభన్‌బాబు.

చక్కగా వుండాలి' అన్న నిర్ణయం తీసుకుంది కృషి సలిపి తెలుగుభాషను తేటతెల్లంగా తెలుసుకుంది తెలుగు 'అరంగేట్రం' సెట్లో ఆమె వుచ్చారణను విని, విస్తుపోయాను అసలు సిసలైన తెలుగు పిల్లలాగా మాటాడింది

'అరంగేట్రం' కథ ఒక సంచలనాన్ని కలిగించింది తమిళనాట మనందరికీ సెంటిమెంట్సు ఒకటే గాబట్టి, ఆ కథ తెలుగునాట కూడా సంచలనాన్ని కలిగించి తీరుతుంది ఇదొక న్యూవేవ్ చిత్రం న్యూవేవ్ అంటే అసభ్యత, అశ్లీలత అనుకునేరు కొత్తతరహా చిత్రం అవడంచేత దీనిని న్యూవేవ్ అనడం సమంజసం ఈ చిత్రానికి రాజశ్రీ రచన్ను రాజేశ్వరరావు సంగీతాన్ని, సూరన్న కళను, సుకదేవ్ ఛాయను నిర్వహిస్తున్నారు 'వెంకటేశ్వర వైభవం' నిర్మాత గుళ్లపల్లి నాగేశ్వరరావు నిర్మిస్తున్న ఈ చిత్రానికి పి డి ప్రసాద్ దర్శకుడు లక్ష్మి విడుదల

## జెమినీలో రాజశ్రీ !!

'కలెక్టరు జానకి' చిత్రం తర్వాత జెమినీ సంస్థ తలపెట్టిన సాంఘిక చిత్రంలో రాజశ్రీని పెట్టడం జరిగింది రాజశ్రీ అంటే హీరోయిన్ వేషాలను వేసిన ఆవిడ అనుకునేరు ఆమె కాదు, కథారచయిత, సంభాషణల రచయిత, పాటల రచయిత అయిన రాజశ్రీని నేను పేర్కొన్నది

— హిందీలో విజయఢంకా మ్రోగించిన 'ఆరాధన' చిత్రాన్ని తెలుగులో నిర్మిస్తున్నారు రాజశ్రీచేత రచన్ను కుమార్‌చేత సంగీతాన్ని, నారాయణరెడ్డిచేత మాటలను చేయిస్తున్నారు ఈ చిత్రానికి ఎస్ ఎస్ బాలన్ దర్శకుడు

*శోభన్ –వాణిశ్రీ*

హిందీలో రాజేష్‌ఖన్నా ధరించిన రెండు పాత్రలను తెలుగులో శోభన్‌బాబు, షర్మిలా వేసిన వేషాన్ని వాణిశ్రీ, అశోక్‌కుమార్ భూమికను గుమ్మడి ధరిస్తున్నారు హిందీ చిత్రం మ్యూజిక్ వేల్యూతో హిట్ అయిన విషయం అందరికీ తెలుసు మరి తెలుగు సంగతి ఆ కుమార్‌కే తెలుసు

## శకుంతలగా వాణిశ్రీ

'మరపురాని కథ' కథానాయిక వాణిశ్రీ మరపురాని పాత్రలను పోషిస్తూ, మనం మరువలేని కళాకారిణిగా విరాజిల్లుతూ వుంది ఆమెను ఎన్నో పాత్రల్లో చూశాము ఇప్పుడు శకుంతలగా చూడబోతున్నాము

కాశేశ్వరి ఎంటర్‌ప్రైసెస్‌వారి క్రొత్త చిత్రంలో శకుంతలగా వాణిశ్రీ సాక్షాత్కరిస్తుంది అంటే 'దుష్యంతా శాకుంతలం' పేరిట సినిమా వస్తుందా అని అడగకండి శకుంతలగా కాస్సేపు కనిపిస్తుంది, కలలో

*కలగన్నది ఎవరు!*

హీరో కృష్ణ కలగంటాడు, ఆ కలలో వాణిశ్రీ శకుంతలగా కనిపిస్తుంది 'కరిగించకు ఈ స్వప్నం, కదలించకు నా స్వర్గం అల మునికుమారివని అనుకోని అనుకోని, ఒక వనమయూరివని అనుకోని' అంటూ కృష్ణ మధురస్వప్నం కంటాడు 'కట్' అన్నాడు దర్శకుడు వి ఎస్ బోసు

*పునర్జన్మం*

ఆంధ్ర ప్రేక్షకులకు 'పునర్జన్మం' సినిమాను యిటీవల చూపించారు శ్రీఫిలింస్‌వారు మళయాళంలో అఖండ విజయాన్ని సాధించిన 'పునర్జన్మం' చిత్రాన్ని కొన్ని మార్పులతో, చేర్పులతో వి. ఎస్ బోసు తీస్తున్నారు ఈ కథకు ముళ్లపూడి గారుండడం పెద్ద యస్సెట్ అని చెప్పాలి ఈ చిత్రానికి కె ఎస్ ప్రసాద్, పుహళేంది, కళాధర్‌లాంటి సాంకేతిక నిపుణులు వుండడం బోసుకు ఏనుగంత బలాన్ని యిస్తుంది క్యారెక్టర్ నటుడు గుమ్మడి ఒక ప్రముఖ



'ఖైదీ బాబాయి'లో వాణిశ్రీ, శోభన్‌బాబు.

పాత్రను పోషిస్తున్న యీచిత్రం, బోమకు మొదటి ప్రయత్నం

## అక్కినేని హరికథా కాలక్షేపం

'నటసామ్రాట్' నాగేశ్వరరావు హరికథా కాలక్షేపం చేశారట. ఆయన చేసిన హరికథా కాలక్షేపం అసలయిన హరిదాసులకే చెయ్యడం కష్టమట. నాగేశ్వరరావుకు హరికథ చెప్పవలసిన అవసరం ఏమిటి? అని పాఠకులు అడగొచ్చు. చిత్రకల్పన వారి 'అందాల రాముడు' చిత్రంలో యిరుగు పొరుగువాళ్లను ఆనంద పరచడానికోసం నాగేశ్వరరావు హరికథ చెప్పడం జరిగింది. 'భద్రాచల మహాత్మ్యం' గూర్చి ఆయన వివరించడం జరిగింది. షూటింగ్ చూసినవాళ్లు 'భేష్, సెహభాష్' అంటున్నారు. ఈ చిత్రంలో హరికథ ఒక ప్రత్యేకత.

### పుట్టినరోజు

ప్రఖ్యాత రచయిత ముళ్లపూడి విరచితమైన 'అందాల రాముడు' చిత్రం అక్కినేని నాగేశ్వరరావుగారు జన్మించిన సెప్టెంబరు యిరవయ్యో తేదీన విడుదలవుతుంది. ఆద్యంతం హుషారుగా జోరుగా సాగిన యీ కథకు ముళ్లపూడి రాసిన 'జీవితా ఎక్స్‌ప్రెస్' మూలం. ఈ చిత్రాన్ని సర్వజన రంజకంగా చిత్రీకరించారు దర్శకుడు బాపు.

### లత చేసిన అదృష్టం

'అందాల రాముడు' చిత్రంలో లత, అక్కినేనికి జతగా నటించింది. అందమైన అమ్మాయి పాత్ర ఆమెది. రెండు జడల అమ్మాయిగా ఆమె కనిపిస్తుంది. అక్కినేని సరసన శృంగార నాయికగా నటించడం, లత చేసుకున్న అదృష్టం అనే చెప్పాలి.

'అందాలరాముడు' చిత్రానికి ముళ్ళపూడి రమణ రచన్న, మహదేవన్ సంగీతాన్ని, వి ఎస్ ఆర్ స్వామి ఛాయను నిర్వహించారు. ఇందరో సమర్థులు వున్న ఈ చిత్రం అందంగా వుండడంలో ఆశ్చర్యమేముంది? ప్రేక్షకుల్ని ఆనందపరచడంలో విశయం ఏముంది? ఇదొక రంగుల స్వప్నం.

ఈ చిత్రంలో నాగేశ్వరరావుతో బాటు నాగభూషణం, అల్లు రామలింగయ్య, రాజబాబు, సాక్షి రంగారావు, సూర్యకాంతం, రాధాకుమారి, ధూళిపాళ, రంగస్థల నటి పూర్ణిమ ముఖ్య పాత్రలను పోషించారు. లక్ష్మి ఫిలింస్ విడుదలచేసే యీ చిత్రాన్ని ఎన్ ఎస్ మూర్తి నిర్మించారు. వీరు నిర్మించిన 'బుద్ధిమంతుడు' అక్కినేని పుట్టినరోజున విడుదల అయింది. విజయ విహారం చేసింది. అప్పుడే బాపు ఉత్తమ దర్శకుడిగా రావలసింది.



'డాక్టర్‌బాబు'తో శోభన్‌బాబు, జయలలిత

## బాపుకు వచ్చిన బహుమతి

దక్షిణభారత చిత్రదర్శకుల సంఘంవారి తీర్పు ప్రకారం గత ఏడు విడుదలయిన చిత్రాలలో, 'సంపూర్ణ రామాయణం' చిత్రాన్ని చక్కగా డైరెక్ట్‌చేసిన బాపును ఉత్తమ దర్శకుడిగా ఎన్నుకోవడం జరిగింది. అలాగే బాలచందర్, పుట్టన్న, మీనన్ గార్లను వరుసగా తమిళం, కన్నడం, మలయాళం చిత్రాల ఉత్తమ దర్శకులుగా ఎన్నుకోవడం సంభవించింది. దర్శకుల సంఘం తలపెట్టిన యీ మంచి కార్యం మంచి చిత్రాలు రావడానికి దోహదం చేస్తుంది.

### రష్యా యాత్ర!

ఉత్తమ దర్శకుడిగా ఎన్నికయిన పుట్టన్నగారు జూలై 18 న రష్యాలో జరిగే అంతర్జాతీయ చలనచిత్ర వుత్సవంలో పాల్గొంటున్నారు. మలయాళ దర్శకుడు పి ఎస్ మీనన్ అక్టోబరులో ఫ్రాన్సు చిత్ర వుత్సవంలో పాల్గొంటారు.

## భార్యాభర్తల విదేశయానం

హైదరాబాదు జూబ్లీహాలులో, సిల్వర్ జూబ్లీ నటి అంజలీదేవికి, జూబ్లీ సంగీత దర్శకుడు ఆదినారాయణరావుకు సినీ గోయర్స్ అసోసియేషన్ అధ్వర్యంలో ఘన సన్మానం జరిగింది. జూలై 5 న వైభవంగా జరిగిన సన్మానసభకు 'నటసామ్రాట్' నాగేశ్వరరావు, నడిగర్ తిలగం శివాజీ గణేశన్ ముఖ్య అతిధులుగా వుండడం, కొత్త శోభను చేకూర్చింది. 'భక్త తుకారాం' లాంటి మహోన్నతమైన చిత్రరాజాన్ని సృష్టించిన అంజలీ

# ప్రతి సంవత్సరము దీని ప్రసిద్ధి పురోగమనము పొందుతున్నది

## అంతా మీ ఆదరాభిమానాలవలనే

## లిప్టన్

# రూబీ డస్ట్




లిప్టన్ రూబీ డస్ట్ యింత
అసాధారణంగా ప్రసిద్ధి పొందు
టకు కారణమేమి? ప్రతి
ఒక్క ప్యాకెట్టుకు అధిక
కప్పుల టీని కోరే మీ
అభిమాన బాహుళ్యమే
కారణము. దీని కమ్మని రుచి,
శ్రేష్ఠమైన సువాసనతో
కూడిన చిక్కని డికాక్షన్
తప్పనిసరిగా తృప్తి నిచ్చు
చున్నది.

**ఒక్కొక్క ప్యాకెట్టుకు**
**అనేకమైన కప్పులు**
**హెచ్చుగా ఇవ్వడమువలననే**
**మీ ఆదరాభిమానాలు పొందగలిగినది**

ప్యాకెట్లలోవున్న టీ మాత్రమే తాజాతనము, సువాసన నిలిచివుండును




LRDC-9A/73TEL

దేవి, ఆదినారాయణరావుగార్లను ధన్యజీవులు అనడం వుచితం.

అన్యోన్యానురాగబద్ధులైన ఆలు, మగలుగా సినీ పరిశ్రమలో వుండడం చాలా అరుదు పెండ్లినాటి ప్రమాణాలకు విలువనిస్తూ, విడివడని భార్యాభర్తలుగా వుంటున్నారు అంజలీదేవి, ఆదినారాయణరావు గార్లు ఎంతోకాలంగా విదేశయానం చెయ్యాలని వుండేది వాళ్ల కోరిక యీడేరింది వాళ్ల అబ్బాయి చిరంజీవి చిన్నరావు అమెరికాలో పెద్ద ఇంజనీరుగా వుంటున్నారు ఆయన తన తల్లి, తండ్రులకు 'విసా' తీసి పంపారు ఆ దేశంలో ఆ, ఆలు కొంతకాలం పర్యటిస్తారు

## శోభన్ నేరం చేశాడా?

'అతడు నేరం చేశాడంటే నేను నమ్మను' అంది వాణిశ్రీ. అతడిలో నీతి నిజాయితీల వాసన గుప్పున కొట్టింది ఆమెకు అతడంటే ఆమెకేదో యిది. ఆ యిది ఎలాంటిదంటే ముక్కు, మొహం ఎరుగని అతడ్ని ఆమె గాఢంగా ప్రేమించింది. అతడు అలాగే ప్రేమించాడు.

వయసు మహా చెడ్డది మగవాడిలో బుస కొడుతుంది. ఆడదానిలో అగ్ని రేపుతుంది. దూకుతాడు మగవాడు. అమాయకంగా సిగ్గుపడుతూ మగవాణ్ణి కవ్విస్తుంది ఆడది. పడుచుదనం పరవళ్లు తొక్కుతుంది. ఒంటరితనం ప్రేమకు కొంటెతనం నేర్పుతుంది

శోభన్‌బాబు ఖైదీగా ఆవూరు వచ్చాడు, అతడ్ని విడిచి ఒక క్షణమయినా వుండలేనంతగా ప్రేమించింది వాణిశ్రీ. పిల్లిమీద, ఎలుకమీద పెట్టి ప్రేమకథలు చెప్పుకుంటారు. మనసులో 'నీ కౌగిలి నాలోగిలి' అంటూ పాడుకుంటారు సినిమాలో ప్రేమను గురించి చెప్పుకుంటూ ముద్దూ, ముచ్చటలో పడ్డారు. నిజం చెప్పమంటే నిజంగా ముద్దు పెట్టుకున్నారు. 'కట్' అన్నారు దర్శకుడు కృష్ణ. ఈ ముచ్చటయిన సన్నివేశం శ్రీ బాలాజీ చిత్రవారి రంగులచిత్రం 'ఖైదీ బాబాయ్' చిత్రంలో కనిపిస్తుంది. ఈ చిత్రానికి బొల్లిముంత రచన్ను, మహదేవన్ సంగీతాన్ని, సుందరబాబు ఛాయను, తోట కళను, ఆదుర్తి హరినాథ కూర్పును నిర్వహిస్తున్నారు. టి. బాబుల్‌నాథ్ నిర్మిస్తున్న యీ చిత్రం లక్ష్మి ఫిలింస్‌ద్వారా విడుదలవుతుంది.

### *అపూర్వ నటన!*

అదేమి చిత్రమో గాని, శోభన్‌బాబుకు దొరికే పాత్రలన్నీ అతడి నట జీవితాన్ని మెరుగుపరచేవిగా వుంటున్నాయి 'ఖైదీ బాబాయ్' చిత్రంలో శోభన్ అపూర్వంగా నటించారు అతగాడికి 'షావుకారు' జానకి, జగ్గయ్య, గుమ్మడి మరియు వాణిశ్రీ పెద్ద సపోర్టు నిచ్చారు

## శోభన్ కొత్త చిత్రాలు

ప్రముఖ నిర్మాత సుందరలాల్ నహతా నిర్మించే కొత్త చిత్రంలో నటించడానికి శోభన్ అంగీకరించారు శ్రీ ఫిలింస్ బ్యానర్‌లో తయారయ్యే యీ చిత్రానికి బి ఏ సుబ్బారావు దర్శకుడు

పల్లవి ప్రొడక్షన్స్ ఈస్ట్‌మన్ కలర్‌లో నిర్మిస్తున్న 'అందరూ దొంగలే' చిత్రంలో నటించడానికి అంగీకరించారు శోభన్ ఈ చిత్రానికి జగపతి అధినేత వి బి రాజేంద్ర ప్రసాద్ దర్శకుడు.

మధు మూవీస్ నిర్మిస్తున్న చిత్రంలో శోభన్ కథానాయకుడు, ఈ చిత్రాన్ని దర్శకుడు వీరమాచనేని మధుసూదనరావు నిర్మిస్తారు

పత్రికా రచయిత నాశిరాజు ప్రకాశం మమతా కంబైన్స్ పేరిట తలపెట్టిన తొలిచిత్రంలో నటించడానికి అంగీకరించారు శోభన్ ఈ చిత్రానికి కె విశ్వనాథ్ దర్శకుడు

'జీవితం' నిర్మాతలు సూర్యచంద్రరావు, గిరిబాబు తీయనున్న రెండవ చిత్రానికి శోభన్ కథానాయకుడు. నిర్మాతల్లో ఒకరయిన గిరిబాబు యీ చిత్రాన్ని డైరెక్టు చేస్తారు.

## రామ, లక్ష్మణులుగా

ఎస్వీరంగారావు, ఎన్టీరామారావుగార్లు నటిస్తున్నారు ఒక చిత్రంలో లంకేశర్వుడేమిటి, రాముడుగా నటించడేమిటి, రఘు రాముడేమిటి, లక్ష్మణ పాత్రను పోషించడమేమిటి? అన్న సందేహం మీకు కలగొచ్చు వాళ్లు ఆ పేరుగొన్న సాంఘిక పాత్రలను విఠలాచార్య చిత్రంలో నిర్వహిస్తున్నారు. అన్నయ్య మాటను జవదాటని తమ్ముడిగా రామారావు పాత్ర వ్రాయబడింది, యీ కథలో.

### *సీతమ్మగా అంజలీదేవి*

ఆయన వదిన సీతమ్మగా అంజలీదేవి నటిస్తున్న ఈ చిత్రం శరవేగంగా తయారవుతూ వుంది ఈ చిత్రానికి బొల్లిముంత రచన్ను, మహదేవన్ సంగీతాన్ని, ఎస్ ఎస్ లాల్ ఛాయను చేపట్టారు. దర్శకత్వంలో ఎస్. డి లాల్ తోడ్పాటు వుంది ఆచార్యాకు ప్రధాన పాత్రలను జయలలిత విజయలలిత, పండరీబాయి, రాజబాబు, కృష్ణంరాజు, సత్యనారాయణ, చిక్కాలినేని, బాలకృష్ణ పోషిస్తున్నారు.

న్యాయ ధర్మాలకు, నీతి, నిజాయితీలకు విలువనిచ్చే వుత్తమ గుణసంపన్నుడయిన లక్ష్మయ్య పాత్రను 'నటరత్న' రామారావు పోషిస్తున్నారు. ఆయనకు సరిపడే పాత్ర యిది ఉదాత్త కథానాయకుడి పాత్ర యిది ప్రేక్షకుల సానుభూతిని పొందే పాత్ర యిది ఆయన నట జీవితంలో మరపురాని పాత్ర యిది, ఇది విజయా ద్వారా విడుదలవుతుంది.

## ఇంటి దొంగలు

సుభాషిణీ ఆర్ట్ పిక్చర్స్ నిర్మించిన మరొక వినోదాత్మక చిత్రం యిది ఆస్తి కోసం, ఇంటి యజమానిని హత్య చెయ్యడం, ఆస్తికి ఏకైక వారసురాలు అయిన యజమాని కుమార్తెను కూడా పరలోకం పంపడానికి ప్రయత్నించడం, నక్క వినయాలు ప్రదర్శించి, నయవంచన చెయ్యడం తమ ప్రధాన కర్తవ్యంగా పెట్టుకొన్న ఇంటిదొంగల్లో 'చెరపుకురా చెడేవు' సామెతకు బలిగావడం యీ చిత్రం యొక్క ముఖ్య అంశం కథను, మాటలను భమిడిపాటి వ్రాశారు హాస్యరచన చెయ్యడంలో, వ్యంగ్య సంభాషణలను రచించడంలో భమిడిపాటికి ప్రత్యేకశైలి వుందని యీ చిత్రం మరొకసారి నిరూపిస్తుంది. ఈ చిత్రానికి హేమాంబరధరరావు దర్శకుడు.

*సత్యనారాయణ,*

*అల్లు రామలింగయ్య*

'ఇంటిదొంగలు'గా వీరిద్దరూ నటించారు కథానాయకిగా జమున యిరవై ఏండ్ల పడుచుగా, అందమైన అతివగా ఈ చిత్రంలో కనిపిస్తుంది పరిపక్వత నందిన మనస్సు వుంటే, వయస్సు ముదిరినట్లు కనిపించదు ముఖం, అనడానికి జమున ప్రత్యక్ష నిదర్శనం ఆమె సరసన కృష్ణంరాజు నాయకపాత్రను పోషించాడు సహాయ పాత్రలను రావికొండలరావు, నిర్మల పుష్పకుమారి విజయలక్ష్మి పోషించారు చిత్రం ఆద్యంతం హాస్యరయిన సన్నివేశాలతో, బలమైన కథాగమనంతో నడుస్తుంది హాస్య సన్నివేశాలను చిత్రీకరించడంలో హేమాంబరధరరావుగారిది పైచేయి అని మరొక్కమారు యీ చిత్రం ఋజువు చేస్తుంది ఈ చిత్రానికి శేఖర్—సింగ్ ఛాయను, కోదండపాణి సంగీతాన్ని, బి ఎస్ కృష్ణ కళను, మహేంద్ర ప్రొడక్షన్స్ నిర్వహించారు పూర్ణా విడుదల

## అన్నదమ్ములకు మార్పు

ప్రసిద్ధ దర్శకులయిన ప్రత్యగాత్మ, హేమాంబరధరరావుగార్లు స్వయాన అన్నదమ్ములు అన్నగారికి నాగేశ్వరరావు చిత్రాలను ఎక్కువగా డైరెక్ట్‌చేసే అవకాశాలు వచ్చాయి తమ్ముడికి రామారావుతో పనిచేసే అవకాశాలు అధికంగా వచ్చాయి ఇప్పుడు అన్నదమ్ములకు కొంత మార్పు లభించింది ఆమార్పు ఏమిటంటే ?

'మనసు—మాంగల్యం' చిత్ర నిర్మాత 'నటరత్న'తో నిర్మించబోయే చిత్రాన్ని ప్రత్యగాత్మ డైరెక్ట్ చెయ్యడం 'కథానాయకుడు చిత్ర నిర్మాత 'నటసామ్రాట్'తో తీయబోయే చిత్రాన్ని హేమాంబరధరరావు డైరెక్ట్ చెయ్యడం

## పి. ఏ. పి. క్రొన్న అన్‌హోని

హిందిలో విజయవంతంగా నడుస్తున్న 'అన్‌హోని' చిత్రంయొక్క తెలుగు నిర్మాణం హక్కులను ప్రసాద్ ఆర్ట్స్ పిక్చర్స్ అధినేత శ్రీ ఏ వి, సుబ్బారావు కొన్నారట. హిందీలో సంజీవ్‌కుమార్, లీనా చంద్రవర్కర్ ముఖ్య పాత్రధారులు తెలుగులో ఎవరిని పెడతారో, ఆ పాత్రలకు సంజీవ్‌కుమార్‌లాగ నటించగల నటుడు ఒక్కడే వున్నాడు, మనకు అతడు ఆంధ్ర ప్రేక్షకులకు అత్యంత ప్రియతమ నాయకుడు

## 'మైనర్ బాబు'

శ్రీ సారధి అండ్ టి పి ఆర్ కంబైన్స్ నిర్మించిన చక్కటి సాంఘిక చిత్రం యిది ఇది వుత్తమ చిత్రంగా రావడానికి కారణం తాతినేని ప్రకాశరావుగారే వీరు దర్శకత్వం నెరపిన 'పల్లెటూరు ఇల్లరికం, చరణదాసి, పరివర్తన' చిత్రాలను పరికిస్తే, ఎంతటి ప్రతిభావంతులో తెలుస్తుంది ప్రతిభావంతుడు గాబట్టే హిందీ రంగంలో కూడా దేదీప్యమానంగా వెలుగొందడం జరిగింది తన మాతృభాషకు దూరం కాకూడదు అన్న తలంపే యీ చిత్ర నిర్మాణానికి ముఖ్యకారణం అని తెలుస్తుంది

కథ సినిమా అనుకరణ వ్రాసుకుని దర్శకత్వం కూడా నిర్వహించారు తాతినేని ప్రకాశరావు. చిత్రం ఆద్యంతం రాకెట్ స్పీడుతో పరుగిడింది అని తెలిసింది

*ఎటువంటి చిత్రం?*

ఉదాత్తమైన యితివృత్తంగల చిత్రం 'మైనర్‌బాబు' ఉత్తమపాత్ర పోషణ నిండిన చిత్రం మైనర్‌బాబు సంగీత సాహిత్యాలు సమపాళ్లలో మేళవించుకొన్న చిత్రం మైనర్ బాబు

పైలా పచ్చీసుగా తిరుగుతూ, బాధ్యత మరచి విలాస జీవితానికి అలవాటు పడ్డ 'మైనరుబాబు' ఒక మహానుభావుని సందేశంతో మనస్సు మార్చుకొని, తండ్రినీ, ఆస్తినీ వదిలి డిగ్నిటీ ఆఫ్ లేబర్‌నీ ఆచరించి గొప్పవాడు అయిన కథనమే 'మైనర్‌బాబు' చిత్రకథ మైనరు బాబుగా శోభన్‌బాబు, ఆయన ప్రియురాలిగా వాణిశ్రీ నటించారు. హీరో తండ్రిగా గుమ్మడి, ఆయన స్నేహితుడిగా ఎస్వీరంగారావు నటించారు సహాయ పాత్రలను అంజలీదేవి లీలారాణి, సూర్యకాంతం, పద్మినీ, రాజబాబు, చంద్రమోహన్, అల్లు రామలింగయ్య పోషించారు సంగీతానికి చలపతిరావు, వుండ భయమేల ? కనీసం మూడు పాటలయినా



'పల్లెటూరిబావ'లో లక్ష్మి, సుకుమారి, నాగేశ్వరరావు.

హిట్ అయ్యేట్టు చూస్తారు, ఆయన. ఈ చిత్రం నవయుగద్వారా విడుదలవుతుంది

## నేను దురదృష్ట వంతురాలినా ?

లేక నన్నే జాలికు రాలినా అని వాపోయింది విశాలి పుట్టకముందే తండ్రి, పుడుతూ పోనుకొనేటప్పుడు తల్లిని పోగొట్టుకున్నాను మాత్ర ప్రేమకు నోచుకో నాపై కరుణ చూపించాల్సిన సమాజం, కలకటుమ్ములు విసిరింది. విధినే నమ్ముకున్న సంఘం మహాపాతకిగా జమకట్టింది ఇంతేనా ? రక్తం పంచుకుని ఒకేకడుపున పుట్టిన మా అన్నయ్య రామం కూడా నన్ను అసహ్యించుకున్నాడు. 'నీపాడుమొహం చూస్తే నా బ్రతుకు బండలై పోతుంది.' అని కసరి కొట్టాడు తన బంగరు జీవితాన్ని పాడుచేసుకున్నాడు దీనికంతటికీ నేనే కారణమా?

## సినిమా

ఎడారిలో ఒయాసిస్సులాగా, దిక్కుమాలిన నా బ్రతుకులో తాతయ్య బలరామయ్య వాత్సల్యం ఓదార్పు కలిగేసింది అన్నిటికీ మించినది ఆనంద్ ప్రేమ నన్ను పెండ్లి చేసుకుందామని ఆయనకు ఆయనకు అర్ధాంగి కావాలనిపాక ఆశజనించింది నేను స్వార్థంకోసం, బండలు చేసుకున్న మా అన్నయ్యను బాగుపరచకుండా వుండనా? అదెలా సాధ్యము ? పోనీ నా ప్రేమను త్యాగం చెయ్యనా ? నా జీవితేశుని మరచి పోగలనా ? ఇలాంటి సందిగ్ధంలో పడింది. నా బ్రతుకు నా సమస్యలు ఎలా పరిష్కారం అయినాయి, నా అన్నయ్య మంచివాడు అయ్యాడా ? ఈ ప్రశ్నలకు సమాధానం దేవీశంకర్‌పిక్చర్స్‌వారి 'విశాలి' చిత్రం చూడాల్సిందే విశాలిగా శారద, రామంగా కృష్ణంరాజు, ఆనంద్‌గా శ్రీధర్ నటించారు. గుత్తికొండ గోపాలరావు సమర్పిస్తున్న యీ చిత్రానికి అక్కినేని సంజీవి దర్శకుడు మాట, పాటలను ఆచార్య ఆత్రేయ వ్రాశారు తమిరిశ జానకి విరచితమైన 'విశాలి' నవలకు తెరరూపం యిస్తున్నది కె రామమోహనరావు, వి అప్పారావుగార్లు. ఈ చిత్రం తారకరామ, నవభారత్, శ్రీ తారకరామద్వారా ఆంధ్రప్రదేశ్‌లో విడుదలవుతుంది



'వాడే—వీడు' నిర్మాత రామబ్రహ్మంగారికి శుభాకాంక్షలు తెలుపుతున్న కథానాయకుడు రామారావు.

## హిప్పీగా అక్కినేని !

పల్లెటూరులో వుంటూ, పల్లెజీవిత మాధుర్యాన్ని, అందులోని ఆనందాన్ని ఆస్వాదించే ఏడుకొండలు, పట్నంపిల్ల లలితను వివాహం చేసుకొన్నాడు ఆమె యిష్టానుసారంగా యిల్లంతా అలంకరించాడు ఆమె ఏంకోరినా చేస్తూ వచ్చాడు ఆమెకు పుట్టినరోజు వచ్చింది 'వైభవంగా జరిపించు' అని ఉత్తరువు పురమాయించాడు. ఏడుకొండలు ఆరోజు భార్యా భర్తలకు మాటామాటా పెరిగి, యిద్దరూ విడిపోయారు లలిత పుట్టింటికి వెళ్లి అక్కడ్నుంచి హైద్రాబాదుకు మకాం మార్చింది.

లలిత అక్కడ ఒకక్లబ్బులో వున్నట్టు ఏడుకొండలకు తెలిసింది భార్యకు ఏవిధంగానైనా బుద్ధిచెప్పాలని ఏడుకొండలు మారువేషంలో వచ్చాడు హిప్పీగెటప్‌లో వచ్చాడు. వచ్చి

మురిపించే గువ్వల్లాలా
ముద్దుముద్దు గుమ్మల్లారా
చెప్పనా, చెప్పనా, చెప్పనా
చెవిలో చిన్నమాట
ఎంతో మంచిమాట
ఆడది ఎప్పుడు బానిసకాదు
ఆమెకు యిల్లేక ఖైదు' అంటూ

లలితను వుడికించపోగాడు 'కట్' అన్నారు దర్శకుడు ప్రత్యగాత్మ ఈ హుషారయిన సన్నివేశం ప్రసాద్ ఆర్ట్ పిక్చర్స్‌వారి 'పల్లెటూరిబావ'లో కనిపిస్తుంది హిప్పీగా నాగేశ్వరరావు, లలితగా లక్ష్మి నటించారు, శ్రీ ఏ వి సుబ్బారావు నిర్మించిన యీ చిత్రం నవయుగద్వారా విడుదలవుతుంది.

# ధన్యజీవి దాసరి

'తాత—మనవడు' చిత్ర విజయం దాసరి నారాయణరావు జాతకాన్ని మార్చింది. ఎవరన్నా అనుకొన్నారా? డబ్బు, దుసుం నిర్మాత రాఘవ 'సెంటిమెంటల్ ఫ్యామిలీ డ్రామా చిత్రంగా నిర్మిస్తారని, ఆ చిత్రానికి దాసరి దర్శకత్వం వహించి, ఘన విజయాన్ని సాధిస్తారని ఈనాడు నారాయణరావు ఎక్కడున్నారు? ప్రేక్షకుల మనసులో చెరగని ముద్రవేశారు పరిశ్రమ వాసుల నోళ్లలో మెదులుతున్నారు ఎందరో అడుగుతున్నారు, డైరెక్షన్ చేసిపెట్టమని కొందరినే తృప్తిపరచ గలుగుతున్నారు.

ఎందరు పొగిడినా, ఎందరు కాకాలు పట్టినా, దాసరి తొణకడు, బెణకడు



'విశాలి'లో శారద.

ఎందుకంటే ఆయనకు జీవితపు విలువలు బాగా తెలుసు

*మరపురాని రోజు*

హైద్రాబాదు 'తాత—మనవడు' శత దినోత్సవ సభలో 'నటసామ్రాట్' నాగేశ్వర రావుగారు 'తాత—మనవడు' హీరో దాసరి నారాయణరావుగారు అని ఒకటికి పదిసార్లు అన్నప్పుడు ఆయన ఆనందబాష్పాలు రాల్చాడట. ఆ మహానటుడి దీవెనలు జీవితంలో మరపురాని పాఠాలుగా వుంటాయట నారాయణరావుగారి దర్శకత్వంలో నాకొక చిత్రం పనిచెయ్యాలనివుంది, అని అక్కినేని అన్నప్పుడు దాసరి ఒళ్లు పులకించిందట. మొత్తానికి దాసరి ధన్యజీవి అయ్యాడు

—శ్రీనివాస్ ●

# ఒక వారం విపరీతం ఫాలాక్షుడు

## 250 సినిమాల హీరో!

ప్రబల మళయాళ సినిమానటుడు ప్రేమ్‌నజీర్ యింతవరకూ 250 సినిమాలకు పైగా నటించారట. హిందూదేశంలోనే యిన్ని సినిమాలలో నటించిన హీరో లేడట.

## శత్రుఘ్నసిన్హా హేమ మాలినిల వివాహం ?

హిందీనటుడు శత్రుఘ్నసిన్హాకు, నటి హేమ మాలినికి రహస్యంగా వివాహమై పోయిందని, వాళ్ళు "హనీమూను" అమెరికాలో చేసుకుంటున్నారని జోరున వోవార్త పాకింది. ఇది నిజంకాదని, హేమ




మాలిని తన బృందంతో నృత్యప్రదర్శనలివ్వడానికి అమెరికా వెళ్ళిందని, వో హిందీ సినిమాలో చిన్న ప్రేమఘట్టం అమెరికాలో తీయదల్చుకున్న వో నిర్మాత ఆ చిత్రంలో హీరోగా నటిస్తున్న శత్రుఘ్న సిన్హాతో సహ అమెరికా వెళ్ళారని, అక్కడ ఆ పిక్చరులో కథానాయకి హేమమాలినితో ఆ ఘట్టం తీయబోతున్నారని, నటి హేమమాలినికి అయిన వారన్నారట.

## అబద్ధపువార్త—హైకోర్టులో ఫిర్యాదు

నటి వైజయంతిమాలకు, ఆమె భర్తకు ఏవేవో మనస్పర్థ లొచ్చాయని, వారిరువురూ వేరేవేరే వుంటున్నారని, "ఇది విడాకులకు దారితీస్తుంద"ని ప్రముఖ చలనచిత్ర నిర్మాత, దర్శకుడు శ్రీధర్ తన పత్రిక "చిత్రాలయ" లో పేర్కొన్నారట. ఈ విషయం అబద్ధమని, తాము కలిసి వుంటున్నామని అబద్ధం వార్తలు సృష్టించి తమ పరువును తీయ చూడ్డం నేరమని వైజయంతిమాల, ఆమె భర్త డాక్టర్ బాలీ కలసి మద్రాసు హైకోర్టులో ఫిర్యాదు చేశారట.

## ప్రపంచ జనాభాలో ఏడవ వంతు!

1971వ సంవత్సరపు లెక్కల ప్రకారంవిత్ర స్వతంత్ర భారతదేశజనాభా 54,79,49,809 అట! అనగా ప్రపంచంలో వున్న జనాభాలో ప్రతి ఏడుగురిలో ఒకడు భారతీయుడట ప్రపంచంలో ఎక్కువజనాభా కలిగిన నగరాలలో కలకత్తా ఏడవదట. అక్కడ డెబ్బయిలక్షల, ముప్ఫయొక్క వేల జనులు వున్నారట. ప్రపంచంలో అత్యధిక జనాభా కలిగిన న్యూయార్కులో నూటపదిహేను లక్షల జనం వుంటున్నారట మన దేశంలో వున్న జనాభాలో 80 శాతం గ్రామాలలో వుంటున్నారట మిగిలిన 20 శాతం మంది మూడువేల పట్టణాలలోనూ, పరిసరాల్లోనూ వున్నారట. ఢిల్లీలో 36,47,000 మంది, మద్రాసులో 31,70,000 మంది, హైదరాబాదులో 17,96,000 మంది, బెంగుళూరులో 16,54,000 మంది, పూనాలో, 11,35,000 మంది వుంటున్నారట—అందుకనే శ్రీ కృష్ణపరమాత్ముడు . . . సంభవామి యుగే యుగే అనెను.




## స్పృహ తప్పిన స్థితిలో 11 సంవత్సరాలు

1962 లో హైదరాబాదులో 25 ఏళ్ళ రామారావు అనే వో ప్లీడరుగారు స్కూటరు మీద వెళ్తుండగా ఆయన స్కూటరును వో కారు గుద్దిందట. దాంతో ఆయన తలకు కొన్ని గాయాలు తగిలి,




అక్కడ ఆయనకు స్పృహ పోయిందట అనాడు 1962 లో పోయిన స్పృహ యింకా 1973 వరకూ అనగా 11 సంవత్సరాలు గడిచినా రాలేదట హైద్రాబాదు ఉస్మానియా ఆసుపత్రిలో యీయన వున్నారట. డాక్టర్లాయనకు గ్లూకోజూ, పాలూ ఆహారంగా యిస్తున్నారట. ఆయనకు యీ ప్రమాదానికి ముందే వివాహం అయినదట ఆయనకు కావలసినవారంతా త్వరలో ఆయనకు స్పృహ వచ్చేస్తుందని యీ పదకొండేళ్ళుగా అనునిత్యం ఎదురు చూస్తున్నారట.

"నేను ఆ ఐదు రోజులు ఎవరి ముందుకూ వెళ్లేదాన్ని కాదు.



ఇప్పుడు నాకు 'కేర్ ఫ్రీ' సానిటరి నేప్‌కిన్‌లను
గురించి అదృష్టవశాత్తు తెలిసింది మరియు
నెలలో 30 పూర్తి రోజులు హాయిగా వున్నాను!''

వండర్‌రాప్‌గల క్రొత్త కేర్‌ఫ్రీ స్త్రీయొక్క
దేహమునకు పూర్తి సౌఖ్యమును, పూర్తి రక్షణను యిస్తుంది.
నెలలో ఆ ఐదు రోజులు స్త్రీయొక్క దేహమునకు ఒక ప్రత్యేక
మైన రకపు రక్షణ తప్పకుండా కావాలి. ఆ బాధ్యతను
తీసుకొనుటకు యిప్పుడు కేర్‌ఫ్రీ ఉంది.
కేర్‌ఫ్రీ యొక్క పై పొరయగు సాటిలేని వండర్‌రాప్ తెమ్మను లోపలి
పొరలలోనికి త్వరగా పీల్చుకొంటుంది కనుక మీ చర్మము
పొడిగా ఉంటుంది మరియు మీరు సౌఖ్యముగా ఉంటారు.



కేర్‌ఫ్రీ మాత్రమే నేప్‌కిన్ లోపలి పొరలలోనికి
తెమ్మను ఏకరీతిగా చేరేలా చేసే, ప్రత్యేకమైన
పీల్చే గుణముగల పదార్థముతో తయారుచేయబడినది.
అందువలన ఒకేచోటు తడిసి పాడవదు.

నేప్‌కిన్ అడుగు భాగమంతా మరియు రెండు
వైపులా చుట్టివున్న నీలి అంచు కారణముగా
మరక పడుతుందను బాధ ఉండదు.

కేర్‌ఫ్రీ వాడుకలో ఎంతో వీలైనది. ఎందుకంటె, దానిని
కడుగుకోవచ్చును. కనుక మీరు బయట తిరుగునపుడు లేక
ప్రయాణములో చికాకు పడరు.

కేర్‌ఫ్రీ మీ దేహమునకు సౌఖ్యముగా సరిపోయేలా
మార్చుకోగలిగే సైజులో లభిస్తోంది.
ప్రతి ప్యాకులోను ఉచితముగా
యివ్వబడే కేర్‌ఫ్రీ బెల్టు పెట్టబడింది.

**అమ్మయ్య! మీరు నెలలో
30 పూర్తి రోజులు
హాయిగా ఉండగలరు!**




**జాన్సన్ & జాన్సన్**
**స్త్రీలకు హాయియైన రక్షణకు**




### జరిగిన కథ

నిలయ చెల్లెలు లోక. రోగంతో తీసుకుంటున్న ముసలితండ్రి ఒకడున్నాడు. సంసార బాధ్యత అంతా నిలయదే ఆమె ఒక ఆఫీసులో పని చేస్తున్నది. ఆ ఆఫీసులోనే పని చేస్తున్న భాస్కరరావు ఆమెని పెళ్ళాడతానన్నాడు. కాని, కుటుంబ పరిస్థితి దృష్ట్యా నిలయ అంగీకరించలేదు. లోకకి సినిమాలంటే పిచ్చి. ఆమెకి తగినవాడే మోహన్. సినిమాల్లో చేర్పిస్తానని లోకని మద్రాసు తీసుకు వచ్చాడు మోహన్. నిలయా మధూ ఒకరినొకరు ప్రేమించుకున్నారు. కాని మధు తల్లి అందుకు సమ్మతించలేదు. వేరే సంబంధం గురించి చెప్పింది. మధు తల్లడిల్లిపోయాడు. లోక గర్భవతి అయ్యాక మోసంచేసి వెళ్ళిపోయాడు మోహన్. జయ ఆమెకి మంచి స్నేహితురాలు. తన తండ్రితో నిలయ పార్కులో కనిపించిందని విన్నాక జయ మనసు మనసులో లేదు. సుందర్ జాన్సీ మనసులో మధురంగా నిలిచాడు.

## 10

రామనాథంగారంటే ఉన్న భయం మూలంగా మిగిలిన గుమాస్తాలు గట్టిగా అనుకోకపోయినా వాళ్ళు చెప్పుకునే గుసగుసలు అప్పుడప్పుడు నిలయ చెవిని పడుతూనే ఉన్నాయి. 'ఏం చూసి వాడిని బుట్టలో వేసుకుందో' అని ఒకరంటే 'పాపం! ఈ అమ్మకింక పెళ్ళి యోగం లేదని తెల్సుకుని అలా చేసిందేమో' అని మరొకరు. వాళ్ళ మాటలు విని మనసు బాధతో మూలిగినా గుండె రాయిచేసుకు ఊరుకుంది నిలయ. ఆరోజు సాయంత్రం జయతో ఒంటరిగా మాట్లాడాలని ఆదరాబాదరా ఆఫీసు నించి ఇంటికి కూడా వెళ్ళకుండా తిన్నగా రామనాథంగారింటికేసి నడిచింది నిలయని చూస్తూనే 'కూర్చో! నాన్నగారు బజారు కెళ్ళారు కూరలు తేవడానికి' అంటూనే తనపని అయిపోయినట్టు అక్కడి నించి వెళ్ళిపోయింది జయ.

'నాన్నగారి కోసం రాలేదు. జయా! నీతో మాట్లాడాలనే వొచ్చాను.'

'నాతో ఏముంది మాట్లాడటానికి?'

'కావల్సినంత ఉంది' వెనక్కి తిరిగిన జయని భుజం పట్టుకుని ఆపింది నిలయ.

'నిన్ను చూస్తుంటే నాకు నవ్వూ, జాలీ కూడా...'

'నామీదెవరూ జాలిపడక్కర్లేదు జాలి పేరుతో ఇప్పటికి చేస్తున్నది చాలు.'

'పిచ్చి జయా...'

'రామనాథంగారిల్లు ఇదేనా...' వీధిలో మాట వినపడి ఇద్దరూ కూడా బయటకి చూశారు. చేతిసంచీతో ఒక ముసలావిడ వాకిట్లో నిలబడి ఉంది. రెండడుగులు ముందుకే వేసి 'ఇదే' అంది జయ. రిక్షావాడు చిన్న ట్రంకుపెట్టె లోపల పెట్టి, ఆవిడ దగ్గర డబ్బులు తీసుకుని వెళ్ళిపోయాడు 'ఎవరా ఈవిడ?' అని తెల్లబోయి చూస్తూ నిలబడిపోయింది జయ 'రామనాథం కూతురువేనా నువ్వు?' జయని దగ్గరగా తీసుకుందావిడ. ఔనన్నట్టుగా తల ఊపింది జయ.

'ఎప్పుడో నీ చిన్నతనాన చూశాను. మళ్ళీ కల్సుకుంటేగా. మీ నాన్నకి వరసకి పిన్తల్లి నవుతాను. రాకపోకల్లేవు. ఇంకెవరికెవరు గుర్తుంటారు? యాత్రల్లో ఉన్నాన్నాళ్ళూ. యాత్రల్నించొచ్చాక ఎవరి ద్వారానో తెల్సింది మీ అమ్మ పోయినట్టు. ఉండబట్టలేక పిల్లలెలా ఉన్నారోనని ఇలా వొచ్చాను.' పరిచయంతోపాటూ తన రాకకి కారణం తెలియజేసిందావిడ.

'మీ నాన్న ఇంట్లో లేడా?'

'లేరు. బజారెళ్ళారు. రండి. కాళ్ళు కడుక్కుందురుగాని. నీళ్ళిస్తాను'

జయ మాట వినిపించుకున్నట్టు లేదావిడ తన ధోరణిలో తను చెప్పుకపోతోంది. 'మీ నాన్న చిన్నప్పుడు మేమంతా ఒకే ఊళ్ళో ఉండేవాళ్ళం. పక్క పక్క ఇళ్ళే. నన్నొదిలిపెట్టి ఒక్క క్షణం ఉండేవాడు కాదు మీ నాన్న. అబ్బాయి ఉద్యోగరీత్యా సేమూళ్ళు పట్టి తిరగడం మొదలెట్టాక ఉత్తరాలూ లేవు, రాకపోకలూ లేవు. ఉన్న ఒక్క కొడుకూ 'పెళ్ళి చేసుకోరా, చేసుకోరా' అంటే చెవిని పెట్టకుండా వయసు ముదరబెట్టుకుని చూస్తుండగానే పలభయ్యో పడిలో పడ్డాడు. నా కళ్ళముందే రాలిపోనూ రాలిపోయాడు. నే నింకా ఉండి ఏం ఉద్ధరించాలని? నన్నన్నా తీసుకుపోయాడు కాదా భగవంతుడు.' మధ్యలో ఆగి కళ్ళు తుడుచుకుందావిడ. 'అబ్బాయి పోయాక మనసు చిక్కపట్టుకుందుకు మార్పుకోసం, తెల్సినవాళ్ళంతా యాత్రలకి వెళ్తుంటే నేనూ పడిపోయాను. యాత్రల్నించొచ్చాక తెల్సింది మీ అమ్మ పోయిన కబురు. ఇలా పరిగెత్తుకొచ్చాను. ఇంక నాకు మాత్రం ఎవరున్నారు కనుక. ఉన్న బంధువుల్లో కల్లా దగ్గరవాళ్ళు మీరే, ఏదో నా బతుకిలా, ఇక్కడే వెళ్ళిపోతే...' అప్పటికి అర్థమైంది జయకి ఆవిడ ఇంక తమ దగ్గరే ఉండిపోవచ్చినట్టు.

'సరే! మరి నే వెళ్తాను జయా. ఇంకో రోజు వస్తాను.' నిలయ మాటకేమీ జవాబివ్వలేదు జయ. వెళ్ళిపోయింది నిలయ.

ముసలావిడ వచ్చాక జయకి విశ్రాంతి ఎక్కువగానే ఉంటోంది. ఓపిక, శక్తి రెండూ కూడా ఎక్కువే ఆవిడకి. ఇంట్లో అందరికీ ఆవిడ వచ్చాక చాలా హాయిగానూ సుఖంగానూ ఉంటోంది. రామనాథంగారి కూడా ఇంట్లో ఓ పెద్ద దిక్కు, ఉడ

దిక్కు అంటూ ఉంటుందని ఇష్టంగానే ఉంది. కానీ, నిలయతో తన ప్రవర్తనకి ఆవిడకేమన్నా సమాధానాలు చెప్పుకోవల్సి వస్తుందేమోనని కష్టంగానూ ఉంది. ఆవిడకిదివరకు కొద్దిగా భూమి ఉండేది. చూచాయగా ఆయనకి తెల్సు ఇప్పుడది ఉందో లేక కొడుకు పోయే లోపలే దాన్ని కరిగించి మరీ పోయాడో ఆయనకి తెలియదు. అడిగితే ఏమనుకుంటుందోనని ఆవిడ దగ్గిర ఆ విషయమే ప్రస్తావించలేదెప్పుడూ.

నిలయ అదే పనిగా చెప్తుండడం వల్ల జయకి సంబంధాలు చూడటం మొదలెట్టారు. ఆయన మనసులో ఓ ఆలోచన పుట్టింది. జయకి పెళ్ళి చెయ్యమని నిలయ అదే పనిగా చెప్పడానికి్కారణం ఇంట్లో పెద్ద పిల్ల అడ్డు తీరిపోతే తామిద్దరూ మరింత చనువుగా మెలగడానికి వీలుంటుందన్న ఉద్దేశ్యమేమో! ఈ ఆలోచన ఆయనకి కొత్త ఉత్సాహాన్ని, బలాన్ని ఇచ్చింది. ప్రయత్నం ఫలించి మంచి సంబంధం ఒకటి కళ్ళ పడింది. అబ్బాయి స్కూల్లో టీచరు కొద్దిగా నలుపే మనిషి. ఒక్కడే కొడుకు తల్లి తండ్రులకి. తల్లీ, తండ్రీ స్వంత ఊళ్ళో స్వంత ఇంట్లో ఉంటున్నారు. అబ్బాయికి మాత్రం ఈ ఊళ్ళోనే ఉద్యోగం. స్వంత ఇల్లూ, ఉద్యోగం తప్ప మరే ఇతర ఆస్తిపాస్తులూ లేవు. అయితేనేం అంతకంటే ఏం కావాలి? గొంతెమ్మ కోరికలు కోరుకుందుకు తను మాత్రం మహా ఉన్నవాడా? ఇంతకంటే మంచి సంబంధం ఈ జన్మలో తమ తేగలడా? ఆస్తిపాస్తులున్న సంబంధం కావాలంటే ముందు తనకి ఉండద్దూ ఆస్తులు. కట్న రూపేణా ముట్టచెప్పడానికి వేలకివేలు తన చేతిలో ఉండద్దూ. నిలయతో కూడా మాట్లాడారాయన. నిలయ వెంటనే తన సంతోషం తెలిపింది. ఈ సంబంధంలో ఏ లోపం లేదంది. కానీ జయ అంగీకారం ముఖ్యమని ఆయనకి గుర్తు చేసింది. పెళ్ళి చూపులయ్యాయి. అన్నీ బానే ఉన్నాయి. అటువైపునించి అంగీకారం కుదిరింది. అయితే, కట్నం మేము ఎక్కువడగం మూడువేలు చాలన్నారు వాళ్ళు. 'ఒక్కొక్కళ్ళకి మూడేసివేలిచ్చి ఇంతమంది కూతుళ్ళకి నే నెక్కడ పెళ్ళి చెయ్యగలను'



అంటూ దిగాలుపడ్డారు రామనాథంగారు. 'ఇన్నేళ్ళనించీ ఉద్యోగం చేస్తున్నావు. అసలే మాత్రం వెనకేశావు?' ముసలావిడ ప్రశ్నకి తెల్లమొహం వేశారాయన.

'నా రోజులా అయిపోయాయి. నా దగ్గిరున్న డబ్బు నాతో మూటకట్టుకుపోతానా ఏమన్నానా? ఏదో మీకన్నా అది ఉపయోగపడితే అదే పదివేలు. నువ్వు కాదనకుండా ఒప్పుకో. మూడువేలన్నా ముట్టచెప్పందే ఇంత మంచి సంబంధం నీ కూతురికి దొరుకుతుందనుకున్నావా? ఇప్పటికిది కానీ, తర్వాతి పిల్లల మాటంటావా? నారు పోసినవాడు నీరు పొయ్యక మానడు. నా పొలం అమ్మేస్తాను. ఆ వొచ్చే డబ్బు నీ పిల్లల పెళ్ళిళ్ళకి వేణ్ణీళ్ళకి చన్నీళ్ళుగా తోడుపడుతుంది.' అంటూ

# వీడిన మబ్బులు

పెత్తనం ముగించిందావిడ. ఇంకా ఇటువంటివాళ్ళు, ఇంత మంచివాళ్ళున్నారా అన్న సందేహంతోనూ, సంతోషంతోనూ వెంటనే ఏమీ మాట్లాడలేక పోయారు రామనాథం గారు.

జయ కూడా తన సమ్మతి తెలిపింది. పెళ్ళి చేసుకోనవడానికి కారణమేమీ లేదు. ఏన్నాళ్ళో అప్పుడు పెళ్ళి చేసుకోక తప్పదు. అదే ఆడదాని జీవితానికి రక్షణ. ఇది వరకైతే, తను పెళ్ళిచేసుకని వెళ్ళిపోతే ఈ ఇంటి విషయాలు సరిగ్గా చూసే దెవరు? సమర్థించుకునే దెవరన్న బెంగ ఉండేది. కానీ ఇప్పుడు ముసలావిడ ఉంది కాబట్టి ఇంక ఆ చింతలేదు. కన్న తల్లిలా ఇంటికి పెద్దలా అందర్నీ చూసుకుంటోంది. ఇంటి బాధ్యత నెత్తినేసుకుంది. నాన్నగారు కూడా ఇదివరకట్లా కాకుండా చాలా బాధ్యతగా ఉంటున్నారు. ఇంక తనకి దిగుల్లేదు. కానీ నీలయ విషయమే కొంచెం భయంగా ఉంది. తన పెళ్ళి కింత తొందరెందుకు పడతుతోందో అర్థం కావట్లేదు. తను పెళ్ళయి వెళ్ళిపో ఈ ఇంట్లో ఇంకావిడకి అడ్డు ఉండదనుకుంటోందా? తన పిచ్చిగానీ ఇప్పుడు మాత్రం ఆవిడ స్వేచ్ఛకి అడ్డేముంది? తనుండి ఏమ్మైనా చెయ్యగలుగుతోందా? తనింట్లోంచి వెళ్ళిపోతే ఏం జరగబోతోందో? ఆలోచనతో విసిగెత్తిపోయి చివరికి 'ఏది ఎలా జరగాలనుంటే అలా జరిగితీరుతుంది. తప్పదు.' అన్న వేదాంతం మనసుకి పట్టించుకోడానికి ప్రయత్నించింది జయ. పెద్ద ఆర్భాటమేమీ లేకుండానే, ఉన్నంతలోనే పెద్ద కూతురి పెళ్ళి అయిందనిపించారు రామనాథంగారు. 'ఏమీ బెంగ పెట్టుకోకు జయా! ఊళ్ళోనేగా ఎప్పుడు కావాలనుకుంటే అప్పుడు వొచ్చి ఇంట్లో అందర్నీ చూసి వెళ్తూ ఉండచ్చు' జయను ఓదార్చిన తల్లి వచ్చింది నీలయ.

'హు! నేనెందుకు బెంగపెట్టుకుంటాను. నువ్వు నాన్నగారి నెలా చూసుకుంటున్నది ఊళ్ళోనే ఉండి నేనన్నీ గమనిస్తూనే ఉంటానని నీకే బెంగ' మనసులోనే అనుకుంది జయ.

* * *

ఝాన్సీ, సుజాతతో మాట్లాడుతోం దన్నమాటేగానీ చూపులు వీధిగుమ్మం వైపే ఉన్నాయి. అది గమనించి చేత్తో పొడిచింది సుజాత. 'ఏమిటే ఝాన్సీ? మనిషి ఇక్కడున్నావన్నమాటేగానీ నీ మనసిక్కడున్నట్టులేదు. ఏమిటాలోచిస్తున్నావు?'

'అబ్బే .. ఊ...లేదు. నేనేం ఆలోచిస్తున్నాను' అంటూ సుజాతవైపు తిరిగి సరిగ్గా కూర్చుంది ఝాన్సీ.

మరి కొంచెం సేపట్లోనే 'ఏం చేస్తున్నారు సుజాతా?' అన్నమాట వెనకాల వినపడి ఒక్కక్షణం తడబడింది ఝాన్సీ.

'ఓ! నువ్వా సుందర్! రా!' అంటూ లేచింది సుజాత.

ఏం చెయ్యాలో తెలియక తను కూడా లేచింది ఝాన్సీ.

'పర్వాలేదు. మీరు కూర్చోండి. మీ ఫ్రెండ్సు ఇద్దరూ మాట్లాడుకోండి. నేను లోపలికి...'

'తమరు కూడా కాసేపిక్కడే కూర్చుని మాతో మాట్లాడక తప్పదు సార్! అమ్మా, నాన్నా బజారెళ్ళారు. వెళ్ళి చాలా సేపైంది. ఇంక వొచ్చేస్తారు. కూర్చో' అంది సుజాత.

'ఓ. కే. మీరుకూడా కూర్చోండి' అంటూ ఝాన్సీ కెదురుగా కుర్చీలో కూర్చున్నాడు సుందర్.

'మీరు మాట్లాడుతూ ఉండండి. నే నిప్పుడే ఐదునిమిషాల్లో మనముగ్గురికీ కాఫీ కలిపి పట్టుకొస్తాను' అంటూ వంటింట్లోకి నడిచింది సుజాత.

తప్పనిసరిగా కూర్చుండిపోయింది ఝాన్సీ.

ఏదో తెలియని భయం, గగుర్పాటు, మరేదో తెలియని పులకింత, సంతోషం అన్నీకలిపి ఒక్కసారిగా మనసుని ఉయ్యాల లూగించినట్టయింది. ఎందుకతన్నిచూస్తే తన మనసు తనవశం తప్పుతోంది. ఇతను వస్తాడు చూద్దామనే కదా తనిందాకటి నుంచీ వీధివైపే చూస్తూ కూర్చుంది. మరి అతను ఎదురుగా కూర్చుంటే తలెత్తి చూడనైనా చూడలేకపోతోందే? నోట మాటే రాదే ఈ తడబాటు ఎందుకు? తనింకా జాన్‌ని మర్చిపోలేకుండా ఉన్నా, తన మనసు తనవశం తప్పి మళ్ళీ ఇంకో మగవాడికి చోటివ్వాలని చూస్తోం దెందుకు? ఒకసారి మోసపోయిన తను మళ్ళీ ఆశలు పెంచుకోడమెందుకు? భగవాన్! నీ సృష్టి విచిత్రం. నువ్వు సృష్టించిన మనిషి విచిత్రం. మనిషిలో రోజురోజుకీ పెరిగే ఆశలు మరింత చిత్రం.

'ఆరోజు మా ఇంట్లో మాట్లాడింది రెండుముక్కలే అయినా చనువుగానే మాట్లాడారు. ఇప్పుడేమో ఎవరో ముక్కూ మొహం ఎరగనివాడ్ని నవ్వట్టుగా మాటా పలుకూ లేకుండా అలా కూర్చున్నారేం?'

ఉలిక్కిపడింది ఝాన్సీ కంగారునీ, తడబాటునీ కప్పిపుచ్చుకుంటూ చిన్నగా అంది 'ఏం మాట్లాడను?'

'బాగానే ఉంది. ఏం మాట్లాడాలో నేను చెప్తే చిలకపలుకుల్లా అవి పలుకుతారా?' అతను నవ్వుతుంటే, సిగ్గుపడుతూ నవ్వుతూ తలొంచుకుంది

'మీ ఇల్లు ఇక్కడికెంతదూరం?' అడిగాడు సుందర్.

'దగ్గిరే.'

'మా ఊరు మీకు నచ్చిందా?'

నచ్చిందన్నట్టుగా తల ఊపింది ఝాన్సీ.

ఎదురుగా బల్లమీదఉన్న పుస్తకం చేతిలోకి తీసుకుని చూస్తూ కూర్చున్నాడు సుందర్ మౌనంగా.

'నేను వెళ్తాను సుజా!' అంటూ చటుక్కున లేచింది ఝాన్సీ

'సంతోషించాంలే కూర్చో. కాఫీ కలుపుతుంటే ... ళ్ళిపోతుందిట వెళ్ళిపోతుంది.'

'కాఫీ తాగితేగానీ కదలనివ్వవా ఏమిటి?' సుందర్ వైపొక్కక్షణం చూసి వంటింట్లోకి వెళ్ళింది ఝాన్సీ.

'ఇదిగో అయిపోయింది ఈ టిఫిను ప్లేట్లు రెండూ నువ్వు పట్టుకుని పద. నేను కాఫీ తీసుకొస్తాను'

'నువ్వు తినవూ టిఫిను?'

'అందరికి మల్లేనే నాకూ రెండుచేతులే గాని మూడుచేతులేవుగా అందుకనే రెండు ప్లేట్లు తీసకెళ్ళమన్నాను. నేను తెచ్చుకుంటాన్లే నాకు. మీరు తింటూ ఉండండి. నేనొస్తాను.'

సుందర్ముందు బల్లమీద ప్లేట్లు రెండూ పెట్టి 'తీసుకోండి' అంది ఝాన్సీ.

'రెండూనా?' సుందర్ ప్రశ్నలో నిలిపి

తినరో

'తీసుకోవచ్చు. నాకేం అభ్యంతరం లేదు'

'నాకుంది సుమండీ...మరి...తినాల్సింది నేను కదా!' ఒక్కక్షణమాగి మళ్ళీ అతనే 'రండి, తీసుకోండి మీరుకూడా' అంటూ ఒక ప్లేటుతీసి ఝాన్సీ కందించాడు.

ఇంతలో సుజాత వచ్చింది.

'అసలు మీరేమన్నా కబుర్లు చెప్పుకున్నారా లేదా. వంటింట్లోకి నాకేం వినపడలేదు మాటలు.'

'ఏం కళ్ళతో మాట్లాడుకోకూడదా?'

'ఓ! అయితే...' అంటూ ఝాన్సీ వంక చూసింది సుజాత.

అక్కడినించి త్వరగా వెళ్ళిపోవాలనిపించింది ఝాన్సీకి.

అది భయమో తెలియదు, కలవరపాటో తెలియదు. ఇష్టమో తెలియదు, అయిష్టమో తెలియదు.

సుందర్ కొంటెమాటలకి, కొంటె చూపులకి మనసులో ఏవేవో భావాలు రూపు పెంచుకుంటున్నాయి. మనసు తన అదుపులో ఉండనంటోంది. ఎందుకీ మార్పు తనలో ఏమైకం తనని కమ్ముకుంది? సుందర్‌లోఉన్న ఆకర్షణే కాబోలు అయస్కాంతంలా తనని లాగుతోంది. చివరికేం జరుగుతుంది? ఏం జరగబోతోంది?

'అబ్బ! ఏమిటా పరధ్యానం?' భుజం మీద చెయ్యివేసి సుజాత పలకరించడంతో ఉలిక్కిపడి, ఆలోచనల్లోంచి తేరుకుంది ఝాన్సీ

* * *

'వింటున్నావా?'

'ఊ..'

'ఏమిటి ఊ? నీకేం అభ్యంతరం ఉండదనే నా ఉద్దేశ్యం సుందర్‌తో అదే అన్నాను కూడా. 'నువ్వేమి బెంగపెట్టుకో నక్కర్లేదు. ఝాన్సీకి నువ్వంటే ఎంతో ఇష్టం అని నేను గ్రహించేశాను' అని చెప్పాను.'

'సుజా...'

'ఏం నేనన్నది తప్పా?'

'నా బాధెలా చెప్పుకోను?' ఝాన్సీ కళ్ళల్లో నీళ్ళు చూసి కంగారుపడింది సుజాత.

'ఏమిటి ఝాన్సీ? ఏమైంది? నాతో చెప్పవూ?'

'ఏమని చెప్పను? ఎలా చెప్పను? సుందర్‌ని చూసిన రోజునించే నాలో తుఫాను ప్రారంభమైంది. నాలో కలిగే సంచలనం ఎలా వివరించను? చెప్తే మాత్రం అర్థం చేసుకోగలరా ఎవరైనా?' ఒక్కనిమిషం కిటికీలోంచి బయటికి చూస్తూ మౌనంగా ఉండిపోయింది ఝాన్సీ.

ఏం చెప్తుందోనని, కుతూహలంగా ఝాన్సీ మొహంలోకి చూసింది సుజాత.

'జాన్‌ని ప్రేమించి అతన్ని పెళ్ళిచేసుకుంటానని మాట్లాడిన నేను ఇప్పుడు మరొకళ్ళని పెళ్ళిచేసుకుంటాననటం నా మనసుకే బాగులేదు...'

'భలేదానివే. నువ్వు జాన్‌ని ప్రేమించి, పెళ్ళిచేసుకుంటాననిచెప్పి నీ అంతట నువ్వు తప్పించుకోలేదుగా. అతనే నన్ను మోసం చేశాడు కదా! ఇంక దానికి బాధపడటమెందుకూ?'

'ఎవరు ఎవర్ని మోసం చేశారన్నది కాదు నా ప్రశ్న?' ఆడది ఒకసారే ఒకరికే మనసిస్తుంది. ఎవరికి మనసిచ్చిందో అతన్ని హృదయంలోంచి తీసెయ్యలేదు అంటారు కదా! మరి నేనాడదాన్ని. నా కటువంటి భావంలేదా? రోజూ జాన్ జ్ఞాపకం వస్తుంటాడు. అతన్ని గురించిన ఆలోచనలు నన్ను చుట్టుముడుతుంటాయి...'

'కాలం తీసుకురాలేని మార్పు ఉండదు ఝాన్సీ. ఎటువంటి జ్ఞాపకాలనైనా మరుగుపరిచే శక్తి కాలానికుంది, ఔనా? కాదా?'

'అయితే...'

'సుందర్‌కి నువ్వంటే ఇష్టం. నిన్ను పెళ్ళిచేసుకుంటానని తనంతటతనే అడుగుతున్నాడు. అందం, చదువు, ఉద్యోగం అన్నీ ఉన్నాయి. అతనిలో ఏం లోపం లేదు. నువ్వు ఒప్పుకోకపోవడంలో అర్థంలేదు'

'సుందర్‌లో లోపం ఉందని నేను మాత్రం అన్నానా? నా బాధ చెప్పాను కదా! జాన్‌ని మనసులోంచి తోసి, మరొకళ్ళని పెళ్ళాడి జీవితాంతం మనశ్శాంతిగా గడపగలనా అన్నదే నా ప్రశ్న. అదే నా బాధ నేను మరొకళ్ళని పెళ్ళిచేసుకుంటే, జాన్ ప్రేమకి ఎలా విలువ లేదో, నా ప్రేమకీ అలాగే విలువ, అర్థం లేనట్టేగా. అందుకే, అసలు పెళ్ళిచేసుకునే ఆలోచనే నాలో ఉండకూడదు.'

'ఝాన్సీ...నీకేమన్నా మతిపోయిందా? ఎవడో కొన్‌కిస్కాగాడికోసం నీ బ్రతుకు ఎడారిచేసుకుంటావా? ఎవడో మనసులేని



# వీడిన మబ్బులు

వాడికోసం నీ జీవితం ఎండిన మోడు కావాలా? వొద్దు ఝాన్సీ ... వొద్దు. అలాంటి ఆలోచనలు రానివ్వకు.'

'ముందే చెప్పానుకదూ! నాబాధ చెప్పుకున్నా కూడా ఎవరికీ సరిగ్గా అర్థం కాదని. నా మనసులో రేగే తుఫానుతో నా మెదడు వేడెక్కిపోతోంది. నాలో జరిగే యుద్ధం రోజురోజుకీ నన్ను నీరస పరుస్తోంది. ఇదివరకులా కమ్మటి నిద్రకీ, కడుపునిండా తిండికీ దూరమయ్యాను. ఆలోచనలు చుట్టుముట్టి నిద్రపోనిస్తాయా? మగవాడంటేనే భయం, కోపం పేరుకున్నాయి నాలో. అటువంటిది సుందర్‌ని చూసిన రోజునించే నాలో మార్పు బయల్దేరింది. ఎందుకో నాకే తెలియదు. అతనితో మాట్లాడాలని, అతన్ని చూడాలని మరీమరీ అనిపిస్తోంది, కానీ...'

'అందుకే నమ్మాయ్! చక్కగా పెళ్లి చేసుకుని...'

'నన్ను చెప్పనీ...ఆడది ఒక్కరే ఒకరికే మనసిస్తుంది. అన్నమాట నిజం కాదని మగవాళ్ళకి చెప్పినట్టవదా నేను సుందర్‌ని పెళ్ళాడితే నన్ను నేను ఎటూ సమర్థించుకో లేకుండా ఉన్నాను. నాకు నేను సరియైన జవాబు చెప్పుకోలేక పోతున్నాను. అదే నాలో జరిగే యుద్ధం'

'ప్చ్! నీకు నచ్చచెప్పగల శక్తి నాకు లేదు. ఆభారం ఇంకెవరిమీదన్నా వేస్తాను.'

'ఒకటిమాత్రం మర్చిపోవద్దు సుజా! ఈసారి సుందర్ మీ ఇంటికి వచ్చినప్పుడు నా సంగతంతా చెప్పు.'

'అంటే?... నువ్వు జాన్‌ని ప్రేమించి...'

'ఔను. అన్నీ అతనికి వివరంగా చెప్పేసెయ్యి. అప్పుడతను తన అభిప్రాయం మార్చుకుంటాడో లేక ఇప్పటిలాగే అంటాడో చూడాలిగా.'

'ఔను. అదికూడా చూద్దాం. కానీ నువ్వుమాత్రం అసలు పెళ్లిచేసుకో కూడదన్న నిర్ధారణకి రావద్దు. బాగా ఆలోచించుకో, మీవాళ్లెంతో బాధపడతారు నువ్వు పెళ్లే చేసుకోనంటే.'

'చూద్దాం.' నవ్వడానికి ప్రయత్నించింది ఝాన్సీ.

* * *

సుజాత చెప్పినదంతా శ్రద్ధగా విన్నాడు సుందర్. అతని మొహంలో మారే రంగులు గమనిస్తూ చెప్పడం ముగించింది సుజాత. ఝాన్సీ మనసులో పడే వేదన ఒకటికి రెండుసార్లు అతనికి వివరించింది.

'నన్ను కొంచెం ఆలోచించుకోనీ సుజా!' సుందర్ నోటినించి వచ్చిన ఆమాటలకు తెల్లబోయింది. ఝాన్సీని చూసిన మొదటి చూపులోనే 'నాకా అమ్మాయి నచ్చింది. పెళ్లి చేసుకుంటాను' అంటూ ఝాన్సీ తల్లితండ్రుల గురించిన వివరాలు అడిగి తెలుసుకున్న సుందర్ ఇప్పుడింత అనుమానంగా మాట్లాడుతున్నాడెందుకు? జాన్‌ని మొదట ప్రేమించిందని ఇప్పుడు వెనక్కి తగ్గుతున్నాడా? అయినా దాచకుండా అంతా చెప్పమంది ఝాన్సీ. ఏమీ దాచిపెట్టాలనుకోలేదే! లోలోపల ఝాన్సీ ఎంత బాధపడుతున్నది. ఎంత సంఘర్షణ మనసులో రేగుతున్నది అన్నీ చెప్పినా కూడా ఇంకా అర్థం కాలేదా సుందర్‌కి? ఒక్కసారిగా మొహం అలా మారిపోయిందెందుకు?' ఆలోచిస్తూ ఉండిపోయింది సుజాత.

ఆరోజురాత్రి నిద్ర కరువైంది సుందర్‌కి. కళ్ళు తెరిచినా మూసుకన్నా ఝాన్సీ రూపు ఎదురుగా నిలబడి కన్పిస్తోంది. సుజాత చెప్పినదంతా విన్నాక తనలో ఆవేశం, ఆతృత తగ్గాయెందుకని? తనలో ఉత్సాహం నీళ్ళు చిలకరించినట్టు అణిగిపోయిందెందుకని? ఏమీదాచడం ఇష్టంలేక, పెళ్లికిముందే అన్నీ ఒకరి విషయాలొకరికి తెలియడం మంచిదనే ఉద్దేశ్యంతో జరిగిందంతా తనకి సుజాతని చెప్పమంది ఝాన్సీ. ఆవిషయం దాచిపెట్టి తనని పెళ్లాడాలన్న దురుద్దేశ్యం ఝాన్సీకిలేదు. ఝాన్సీ మంచితనం దీనివల్ల తెలుస్తోంది. అయినా కూడా ఇంకా ఎందుకాలోచిస్తున్నాడు తను? ఎందుకా బెదురు తనకి. తీరా పెళ్లిచేసుకున్నాక ఝాన్సీ ప్రేమకథ తెల్సినవాళ్లెవరైనా, తనని చూసి నవ్వుకుంటారేమో, తనవెనకే గుసగుసలు చెప్పుకుంటారేమో నన్నభయం తనలో తొంగిచూస్తోంది. కాలంతోపాటూ ముందుకి సాగిపోయే తత్వంతో ధైర్యంగా ఈ సంఘంలో బ్రతకగలశక్తి తనకందని, ఇన్నాళ్లూ అపోహ పెంచుకున్నాడన్నమాట తను. భగవాన్! ఏంచెయ్యాలి? ఇప్పుడేది దారి? నాలో ప్రేమబీజం నాటిన నువ్వు, ధైర్యాన్నెందుకు ప్రసాదించవు?'

(ఇంకా వుంది)




"మీ వ్యక్తిత్వం నడతా నన్నాకర్షించాయి. నిజం సుభాషిణీ హృదయపూర్వకంగా చెబుతున్నాను. యిన్నిరోజులుగా నేను అన్వేషిస్తున్నది మీలాంటి మీకోసం! వారాలేకాదు సంవత్సరాలు అయినా మీకోసం నిరీక్షిస్తుంటాను."

రమణమూర్తి లైబ్రేరియన్‌గా ఆ బ్రాంచి లైబ్రరీలో సంవత్సరంనుండీ వర్క్ చేస్తున్నాడు.

చేరిన నాల్గోరోజునుండీ సుభాషిణి బుక్స్‌కోసం వస్తున్నది. సాహిత్యంపై చర్చలు వాళ్ళ పరిచయాన్ని వృద్ధిచేశాయి. క్రమేణా అతనిలోని ఆ భావం రూపు దిద్దుకుంటూ ఓ పరిపూర్ణత సంతరించుకుంది.

మొదటిసారిగా వాళ్ళ మధ్య వ్యక్తిగత ప్రస్తావన వచ్చింది అప్పుడే.

తన మాటలు ఆవిడలో ప్రభావాన్ని సృష్టించగలవు ?

అనుగ్రహం బదులు

ఆగ్రహం

ఏర్పడితే ?

చాలా కాలంగా—

అతను నలిగిపోయాడు.

అతనిలో పెరుగుతూన్న ఆశ దుగ్ధ కోరిక లర్చి అతన్ని ప్రశాంతంగా ఉండనివ్వలేదు.

ఆవిడ చూపులలోని ప్రసన్నత—పుస్తకాలు యిచ్చి పుచ్చుకునే లౌకికపరిధిని దాటిన ఓ ప్రత్యేక భావన—బహుశా అతని వూహే కావొచ్చు! అతనికి కొండంత బలాన్నిస్తూ పురిగొల్పింది.

ఎన్నో రాత్రులూ పగళ్ళూ అతని మానసిక క్షోభని మనస్సులో దాచుకున్నాడు.

ఇంతింత వింతెంతగానో పెరిగి పెరిగి అతని ధారణశక్తికి మించిపోగా వెర్రిగక్కి కాడు.

మనస్సు తేలికపడింది. తన గోడు విన్పించగలిగాడు— అన్న తృప్తిని ఆవిడ నిశితమైన చూపులు తినేశాయి.

గుండె దడదడలాడింది. అపార్థం చేసుకుని కోప్పడతుందా ? అదే జరిగితే తనేం చేయాలి? పేరు చెడిపోతుందేమో.

'ఇవ్వండి—వెళ్ళాలి.'

అన్నది సుభాషిణి

ధైర్యం పుంజుకుంటున్నతనితో.

యాంత్రికంగా ఏవేవో నవలలు యిచ్చేస్తున్నాడు. చివరకు రిజిష్టరూ యిచ్చేశాడు.

ఆవిడ కిసుక్కున నవ్వి దాన్ని ఆపుకో ప్రయత్నించాకగానీ తను చేస్తున్నది తెలియలేదతనికి.

ఆవిడ అడిగిన నవల ఏదో జ్ఞాపకం తెచ్చుకొని అతికష్టంపై దాన్ని తీసి అందించాడు.

* * *

మనిషి ప్రాథమిక ప్రధాన అవసరాలయిన తిండి ప్రేమ — మూర్తి విషయంలోనూ నిజమయ్యాయి.

సుభాషిణి తనను అనుగ్రహించగలదన్న నమ్మకం అతనిలో ఓ అవసరాన్ని తీర్చగలిగింది.

ఇంతకాలంగా అతను చేస్తున్న టెంపరరీ పోస్ట్‌ని పర్మినెంట్ చేసేందుకు ఇంటర్వ్యూ కండక్ట్ చేయబోతున్నారని తెలిసింది.

అదే పోస్ట్‌కి చాలామంది బలమైన సిఫార్సులతో యమ్. యల్. ఏ. ఛైర్మన్‌ని చుట్టుముట్టేసి వత్తిడి తెస్తున్నారనీ తెలిసి దిగులు పుట్టుకొచ్చింది.

యిది పోతే తనకు దిక్కేది ? కుటుంబ పోషణ ?

దాన్ని నిలుపుకునేందుకు తన [illegible] వత్తిడి తేగల నాయకులు తనకెవరున్నారు ?

చివరి సిఫార్సు లేని తను ఎగిరిపోవాల్సిందేనా ?

ఒకర్నిగాదు యిద్దర్నిగాదు చాలామందిని అడిగాడు! మార్గం చూపించమని.

చివరికో స్నేహితుడు ఉపదేశించాడు!

ఛైర్మన్‌గారికి పదవి తర్వాత అంత ముఖ్యమైన వ్యక్తి అతని కొడుకు మౌళి రెడ్డి. అతనికి తండ్రికన్నా ప్రీతిపాత్రమైన

వ్యక్తి మనోహరుడు.

ఆ పేరు వినపడగానే—

జీర్ణించుకుపోయిన అహం; దర్పం; స్టైయిల్ విడటే వ్యక్తంటే నిర్లక్ష్యం తన మాటే సాగాలన్న మంకు పట్టుదల—దిక ఓ యువతి రూపు తళుక్కుమన్నది.

చందాదారుడికి ఒక్క పుస్తకం మాత్రమే అన్న రూల్ ని, తన డ్యూటీని కాలదన్ని కాళిరెడ్డి ద్వారా విన్ని కావాలంటే అన్ని యిచ్చేసెయ్ అన్న ఫర్మానా తెప్పించుకున్న సునంద దృష్టిలో తను ఓ అసమర్థుడు ఓడిపోయిన వ్యక్తి, సేవకుడు, ఒకచో విరోధి.

వచ్చిన ప్రతిసారీ తన విజయాన్ని గుర్తుచేస్తూ, సెక్రటరీని మించిన అధారిటీ చెలాయిస్తూన్న సునందని తను అడగటమా?

అడిగినా సహృదయంతో అన్నీ మరచి సహాయం చేయగలదా? ఆవిడని మంచి చేసుకోవటం ఎలా?

*  *  *

తల్లిదండ్రులు — సుదర్శనంతో తన పెళ్ళిని గురించి చర్చించుకోవటం చాటుగా విన్నది సుభాషిణి.

వాళ్ళ సంభాషణ ఆవిడకప్రియంగా తోచింది.

సుదర్శనం అన్నపేరు బదులు మరోపేరు

# ప్రేమకు దృష్టిలేదు

(?) ఉంటే బాగుణ్ణనిపించింది. వాళ్ళ ప్రయత్నాలు విజయవంతమయితే? తన జీవితం నిరర్థకమేనా? ఎలా తప్పించుకోవాలి? అందుకు దారేది? వాళ్ళ ప్రయత్నాలను విరమింపజేసేదెలా?

ఏం ఎందుకు?

అన్న ప్రశ్న ఆమె హృదయాంతరాళంలో మూగగా ప్రతిధ్వనిస్తూంటే

మూర్తిని ప్రేమిస్తున్నది గనుక

అన్న సమాధానం చెప్పకుంది.

మొన్నటి అతని మాటల ప్రాతిపదికపై మాత్రమే ఈ నిర్ణయానికి కొచ్చావా?

అన్న మరో ప్రశ్నకి

కాదు రోజులు తరబడీ తను అతన్ని పరిశీలిస్తున్నది అన్న జవాబూ.

తన వ్యక్తిత్వాన్ని మెచ్చి గౌరవించి జీవితాన్ని పంచుకుందాం అంటున్న వ్యక్తికి గాక అందం సంపద బంధుత్వాలను గీటురాయిగా పెళ్ళాడతానన్న వ్యక్తికి తన నర్పించుకో గలదా?

ఆరాత్రి వాళ్ళమ్మ అన్నది,

'భూషణమన్నయ్య అబ్బాయి సుదర్శనం పాపం చాలా మంచి వాడమ్మాయ్. నీకు నచ్చాడా?'

నాకెందుకు నచ్చటం?

'పిచ్చితల్లి! నువ్వతనికి ఆ యింటర్వ్యూ నాడికే నచ్చావంట. వియ్యమందుతామంటున్నారు'

అయ్యబాబోయ్ తను మౌనంగా ఉంటే మెడకి కట్టేసేట్టే ఉన్నారు. మూర్తితో సంప్రదించాలి.

'నేను చదువుకుంటానమ్మా యిప్పుడే పెళ్ళి వద్దు'

ఆ తల్లి మాత్రం తన ప్రయత్నం మానలేదు. ఏదో ఓ సందర్భంలో సుదర్శనం గుణగణాలను గూర్చి ఆ కుటుంబ హోదా గురించి వాళ్ళ ఐశ్వర్యం గురించీ చెబుతూనే ఉంది.

క్లిష్ట సమస్యకి గురయింది సుభాషిణి.

మూర్తిని గురించి తల్లితో చెబితే?

లేక మూర్తితో మాట్లాడేస్తే?

ఏమో అతనిలోని నిరీక్షణ స్వచ్ఛమయిందేనని పూర్తిగా తేలందే తను బయట పడితే ఆ తర్వాత చులకనవదా?

ఇది జీవితం.

త్వరపడితే భవిష్యత్ అందించే ఫలితాన్ని స్వీకరించాలి. అది ఆనందం కానీ దుఃఖమూ కానీ అవకాశమున్నప్పుడు కోరి జీవితాన్ని కష్టభూయిష్టం చేయగల నిర్ణయాన్నెందుకు తీసుకోవాలి?

*  *  *

రిహార్సల్ చేసుకుంటున్నాడు మూర్తి మౌనంగా.

కేటలాగ్ చూస్తున్నది సునంద.

ఆవిడకి మంచి నవలలు కావాలి.

అతని కావిడ సహాయం కావాలి.

ఆవిడ మనస్సుని ఆహ్లాద పరచగల పని చేయాలితను. అభిమానం సంపాదించాలి. సాధ్యమా?

యింతకాలంగా కలహాలు మిరియాలు నూరుకున్న తాము మంచి మిత్రులు కావటం ఎలా?

ఆవిడ నమ్మగలదా? మనస్సు మార్చుకో గలదా? ప్రియుడి ద్వారా అతని తండ్రికి రికమెండ్ చేయించే బాధ్యత తీసుకోగలదా?

అడిగిన రెండుగాక మరో రెండు కలిపి నాలుగు నవలలందించాడు మూర్తి.

'మనుగా రెండు అడిగిన రోజున ఫీల్సేదన్నావ్, ఈరోజు అడక్కుండానే మరో రెండదనంగా యిస్తున్నావ్! పోటమికి పరిహారమా?'



'దాన్ని ఓటమి అనిపిస్తే — అది ఏనాడో జరిగిపోయింది. యీనాడు జరిగింది పరిహారం చెల్లింపుకాదు. కానుక సమర్పణ.'

'ఆ! ఎందుకు?'

'వేలకొలది శ్రామికుల అవిరామ కృషి మూలకంగా నిర్మితమయిన భగ్న ప్రేమ చిహ్నం తాజ్‌మహల్ కోట్లాది మానవులచే ఆరాధింపబడుతూవుంది. అది ఎవ్వరికీ స్వంతం కాదు. ఆ సౌందర్యంచే ప్రభావితం కాబడిన ఏ ఒక్కరూ తిరిగి ఏమీ చెల్లించలేరు.

సునందా నాది కవితావేశం. కృత్రిమ నాగరికతా నిబంధనలను లెక్క చేయొద్దంటున్నది. కాలి గోటి నుండి తల వెంట్రుక వరకు మొత్తం నీలో నిక్షిప్తమై ప్రస్ఫుటమవుతూన్న స్త్రీత్వం సౌందర్యం నాకు తెలిసినంతవరకు ఎవ్వరిలోనూ లేదు. అది ఇతరులకు లభించని వరం. నాది ముఖస్తుతి కాదు పరిశీలనా దృష్టి. ఇంత శరీరాన్ని మోస్తున్నా ఈ వల్చని పాదాలు కదిలే తీరు, ఆరోగ్యంగా ఉన్నజాతి గుర్రం పృష్ఠ భాగాన్ని గుర్తుకు తెచ్చే నీ అనయువ సౌష్టవం నవ్వుకే అందం తెగల నీ అరిగిన పన్ను ప్రత్యేకత తెలిపే క్రింది పెదవి స్వరంలోని గరగర చిరునాసికలోని గోము, అల్లిబిల్లిగా తిరగాడే చిన్న చిన్న కళ్ళు, ఆ చీరకట్టులో నడుస్తుంటే చూపరుల దృష్టిని ఆకర్షిస్తున్న... .

అందానికి మరోపేరు సునంద తాజ్‌మహల్‌తో పోటీ చేయగల సునందని నేను ఆరాధిస్తున్నాను నా ఈ చిరుకానుక సమర్పించుకుంటున్నాను.'

సిగ్గుతోను—అవును మనుషిగ్గుతో మెలికలు తిరిగిపోయింది సునంద! పైకి ఎగిరి వెళ్ళి వెళ్ళి తాజ్‌మహల్ ముందు సగర్వంగా నిలుచుని!! ఏమంటావ్? అన్నట్లు ఢీకొని.

యింతవరకూ రోడ్‌సైడ్ రోమియోస్ ఆవిడ వక్షోజాలను ముఖారవిందాన్ని మాత్రమే పొగిడారు.

తన దేహంలో ఏవయితే అందవిహీనంగా ఉంటూ వచ్చాయో తనలో ఆవేదనను రగిల్చాయో చివరకు నవ్వించే గూఢ విగతాశికి గురికాబడ్డాయో వాటి అందాన్ని గుర్తించి వివరించి ఒప్పించగలిగిన ఈ మూర్తి నిజంగా ప్రతిభావంతుడు ఏమయినా తన అసంతృప్తిని పోగొట్టి నోదార్చాడు నూతన విశ్వాసాన్ని జనింపజేశాడు!

'కేవలం ఓ లైబ్రేరియన్‌గా మాత్రమే చూస్తూ నా అభిమాన ప్రదర్శనలో నీ వ్యక్తిత్వాన్ని దెబ్బతీశాను. అందుకు చింతిస్తున్నాను మూర్తీ.'

తన లోటు తీరినందు కావిడ—
తన పథకం పారినందు కాతను—
సంతోషంతో తలమున్కలవుతూ—
పరిసరాలనే మరచారు.

గదిలో కడుగెట్టబోయిన సుభాషిణి ఆగిపోయింది.

యింటివద్ద తల్లిదండ్రులు తన ముందుంచిన సమస్య తనకోసం ఘర్షణగా పరిణమించగా దానికో పరిష్కారం లభిస్తుందేమోనన్న ఆశతో ఆత్రుతగా వచ్చింది.

వచ్చాక వారి సంభాషణ విన్నాక ఆ తర్వాత వారి నవ్వుల శబ్దం తన హృదయాన్ని నమ్మకాన్ని; ఆశలనూ నుజ్జు నుజ్జుగా కర్కశంగా నలిపేస్తుంటే—

వెనక్కు తిరిగింది!

ఉద్యోగ గొడవల్లో మునిగిన మూర్తికి తీరిక చిక్కనూలేదు. సుభాషిణి అతనికంట పడనూ లేదు.

తనని పర్మనెంట్ చేస్తూ యిచ్చిన ఆర్డర్ చేతికొచ్చాక అతని ఆనందాన్ని అవధుల్లేని సమయాన పంచుకునేందుకు సుభాషిణి కావాలన్న కోరిక అధికమై—(

ఆవిడ రానందున ఆవిడకొరకై వెదకి—యింటి పరిసరాల్లో తిరిగాడు. అయినా లేదు!

బుక్స్‌కొరకు రావటమూ లేదు!

కల్పకునేదెలా? ఎందువలన రావటం లేదు?

మనస్సులో కల కలం ప్రారంభమైంది. ఆందోళన అధికమయింది. ఆలోచిస్తున్నాడు అందటంలేదు. కారణం బోధపడలేదు.

చివరికోనాడు తటస్థపడింది!

అన్నిరోజుల వియోగాన్ని తీర్చుకోవా

# ప్రాచీన వైద్య పద్ధతులు

## కీళ్ల మోకాళ్లనొప్పులను హరించేవి

1. వెల్లుల్లిపాయలను మెత్తని ముద్దగానూరి పట్టువేస్తూంటే—కీళ్ళ నొప్పులు — మోకాళ్ళ నొప్పులు హరిస్తాయి. చలికాలంలో రోజూ వీనిని మితంగా తింటూంటే కీళ్ళనొప్పులు తగ్గుతాయి.

2. వడకట్టిన పెరుగులో సున్నం కలిపి పట్టువేస్తే కీళ్ళ నొప్పులు, మోకాళ్ళ నొప్పులు నివృత్తిస్తాయి.

3. ప్రత్తి ఆకులను ముద్దగా దంచి—ఆముదంతో ఉడికించి—నొప్పులు గల చోట పట్టువేసి కట్టుకడితే మోకాళ్ల నొప్పులు నయమవుతాయి.

4. పెద్దపల్లేరు ఆకుల రసాన్ని రెండు వంతులు—నువ్వుల నూనె ఒక వంతు కలిపి—ఆ తైలాన్ని పక్వమయినంత వరకూ మరగ కాచి—ఆ తైలాన్ని పూటకు తులం చొప్పున, రోజూ ఉదయం సాయంత్రం, పానం చేస్తూ పైన నొప్పులుగలచోట ఆ తైలంతో మర్దన చేస్తూ ఉంటే కీళ్ళ నొప్పులు హరిస్తాయి.

5. తగిరిసచెట్టు ఆకులను మెత్తని ముద్ద అగునట్లు నూరి ఆముదంలో వేసి వెచ్చచేసి—దానితో కాపడం పెట్టి—ఆ ముద్దను వేసి కట్టుకడితే కీళ్ళ నొప్పులు తగ్గుతాయి.

6 ఒక వంతు మహిసాక్షి, రెండు వంతులు పాత బెల్లం కలిపి మెత్తగా నూరి—గోళీకాయంతేసి మాత్రలు చేసి పూటకొక మాత్ర చొప్పున సుమారు పాతిక దినములు ఉదయం, సాయంత్రం మాత్రను నేతిలో ముంచి తిన్నట్లయితే కీళ్ళ నొప్పులు నివృత్తిస్తాయి.

7. నేలతాడి, వోమము, పిప్పళ్ళు ఒక్కొక్క తులం చొప్పున—పిల్లి తేగలు— సొంఠి—పెన్నేరు యివి రెండేసి తులాల చొప్పున మెత్తగా నూరి పదిహేను తులాల పాత బెల్లంలో కలిపి నూరి సుమారు గోళీకాయంతేసి మాత్రలు చేసి—పదిహేను యిరవై దినాలపాటు రోజూ ఉదయం, సాయంత్రం ఒక్కొక్క మాత్ర చొప్పున తింటూంటే కీళ్ళ నొప్పులు తగ్గుతాయి.

సేకరణ : ఆకుండి నారాయణమూర్తి

లన్న కోరిక—

ఏమేమో మాట్లాడాలన్న ఆతృత ఆవేగం—

ఒక్కుదుటున ప్రవాహంలా వెల్వడబోతూన్న ప్రశ్నలను మాటల్ని ఆపుకుంటూ, క్రమబద్ధం చేస్తూ—

'భయపడ్డాను. విచారించాను. బాధపడ్డాను మీరు కన్పించకపోతే ఆ రోజంతా నాకు తోచదు. ప్రశాంతంగా నిద్రపోలేను.'

'నేను కన్పించనంత మాత్రాన ఏం మునిగిపోతుంది! నన్ను మించిన అందగత్తెలున్నారుగా?'

'నేను అందం కోసం ఆరాటపళ్లేదు వ్యక్తిత్వం కోసం — నాలో కరిగిపోతూ

# ప్రేమకు దృష్టిలేదు

త్వలో కలుపుకుంటూ.'

'మరి సునందనేం చేస్తారు? సునంద సుభాషిణీ వ్స్...అమాయకుల్ని చేసి నమ్మించి ద్రోహం చేసేందుకు మేం చేసిన నేరమేంటి? మాతో యింత ధైర్యంగా కపాయిగా ఆడుకునేందుకు మీకు మనస్సెలా వొప్పింది? నువ్వు మనిషివా!'

'సుభాషిణిగారూ ఆగండి అలా మాడకండి మాట్లాడకండి నాకు భయం వేస్తున్నది. ఈ రూపంతో మిమ్మల్ని భరించలేను. ఏదో జరిగింది అపార్థం చేసుకున్నారు'.

'కాదు అర్థం చేసుకున్నాను; ఆనాడు కవితావేశంతో సునందని నీవు పొగడటం ఆవిడగారి మెచ్చుకోలు మరల ప్రదర్శించండి అజ్ఞానులు సైతం యదార్థం చెబుతారు.'

'అదా! ఆ సంఘటనా? అవును పొగిడాను అయితే ఆవిడపై ప్రేమతోనూ కాంక్షతోనూ గాదు. ఒకానొక ప్రేక్షకుడి దృష్టితో. అదీ చాలా కృత్రిమంగా. వీందుకో తెలుసా నా ఉద్యోగాన్ని పర్మినెంటు చేసుకునేందుకు! మొన్నటి వరకూ యిది టెంపరరీ అలాట్‌మెంట్ — నా అప్పాయింట్‌మెంటూ ఆ షరతుపైనే జరిగింది. ఆ తర్వాత దీన్ని పర్మినెంటు చేస్తూ గవర్నమెంట్ జీ. వో. జారీ చేసింది. ఆ కారణంగా ఇంటర్వ్యూ పెట్టి మరల సెలెక్టు చేసుకోవాలన్నది నిబంధన. దీనికై చాలా మంది బలమైన సిఫార్సులతో ఛేర్‌మన్‌గారిని చుట్టు ముట్టేశారు. నాకెవరూ లేరు అనామకుణ్ణి. అయితే సునందకో ప్రియుడున్నాడు అతనికో నాన్నున్నాడు. అతని చేతిలో ఈ పవరూ ఉంది. అది నాకు అనుకూలం కావాలంటే నన్నుగురించి తిరుగులేని విధంగా ఛేర్‌మన్ గారికి చెప్పగలవారు కావాలి. అందుకే సునంద ఏ ఏ అవయవాలు తన అందాన్ని క్షీణింపజేస్తున్నాయని చింతిస్తున్నదో వాటిలో కొత్త అందాలను చూసాను, ఆమె అభిమానం తద్వారా ఈ ఉద్యోగం సంపాయించుకో గలిగాను'

ఆర్డర్ చూపించాడు.

అది చదువుకుంటూ — చదివాకా

ఏడ్చేసింది సుభాషిణి!

ఒక్క పెట్టున దుఃఖమంతా కట్టలు త్రెంచుకుని పొంగి పొరలింది.

అర్థం కాలేదు మూర్తికి.

ఆనందించాల్సిన తరుణంలో ఏడ్పటమెందుకు?

'ఏమండీ? ఏడుస్తున్నారు! నాకూ చెప్పరూ?'

'ఆ సంఘటన మీకు ఉద్యోగాన్నిప్పించటమే కాదు మూర్తిగారూ — మన జీవితాలనూ వేరు చేసింది.

సుదర్శనంగారితో నా వివాహాన్ని తిరుగులేని విధంగా నిర్ణయించేసింది!'

అప్పుడు...... ●

# మనుష్యులకి దూరంగా

పోలవరపు వెంకటేశ్వర్లు



'లాన్లో' కుర్చీలు వేయించుకుని మిత్రులు కూర్చుని వున్నారు.

సిగరెట్లు గుప్పు గుప్పున పొగ వదుల్తూ కాల్తున్నాయి.

మిత్రులమధ్య బాతాఖానీ జరుగుతోంది. రాజకీయాలు, ప్రాపర్టీ సేవింగ్సు సెక్సు, సినిమాలు. చర్చ చివరకి సినిమాల దాకా వచ్చి జోరుగా సాగుతోంది.

ఆ నలుగురూ ఆవూరి 'హైయరప్స్'లో ఒక గ్రూపు. దానికి నాయకుడు రాధాకృష్ణ, పేరు మోసిన లాయరు.

'అంబే' లో కొత్త సినిమా వచ్చింది. జనం విరగబడుతున్నారు. టికెట్లు దొరకటం లేదట.'

'అంత గొప్పగా వుందా ?'

'అని జనవాక్యం,'

'నేనూ చూసాను.' —మాధవరావు అన్నాడు.

'నీబండ తెడ. మాకు తెలీకుండానే ఎప్పుడు చూసావోయి ?'

'అట్టమాకు ఆమధ్య మద్రాసు వెళ్ళినప్పుడు ఓ స్నేహితుడు బలవంతం చేస్తే తప్పలేదు '

'ఎట్లావుంది నీకు ?'

'ట్రెమాండస్. మాస్టర్ పీసనుకో. ఒక్కొక సీనుకి నాలుగుసార్లు ఏడ్చాను!

రాధాకృష్ణ తప్ప మిగతావాళ్ళు పకపకా నవ్వారు.

'ఏం ? మీకు నవ్వులాటగా వుందా ? కావాలంటే చూద్దాం పదండి. మీరూ ఏడవకపోతే నా చెవి కోసుకుంటాను.' మాధవరావు పౌరుషంగా అన్నాడు.

'మరి ఆలస్యం దేనికి ? ఫోనుచేసి 'బాక్సు' రిజర్వు చెయ్యరా ?' అని నారాయణ అన్నాడు. అతనికి ఓ సినిమా హాలూ, మిగతా సినిమాహాల్సులో పరపతీ వున్నాయి, ఆ వూళ్ళో.

'మరేంటి సందేహం ? రాధాకృష్ణా, వెళ్దామా ?'

'నేను రాను.' రాధాకృష్ణ తీవ్రంగా అన్నాడు.

'అదేంటి ?'

'నేను ఆ సినిమా చూడలేను.'

'అంతబోరా ? ఏడవాలిసొస్తుందని భయమా ?'

'ఊహూ, ఏడ్చిఏడ్చి — భయంపోయి ఇప్పుడు నాలో విరక్తిమాత్రమే మిగిలింది.'

'ఏమిటి కథ ?'

'పిట్టకథ కాదుకదా !'

'నవ్వకండి జంటిల్మెన్! ఇది సీరియస్ విషయం. ఈ సినిమా ట్రాజెడీ దీని వెనకాల ఇంతకంటె పెద్ద ట్రాజెడీ వుంది. ప్రత్యక్షంగానూ, పరోక్షంగనూ నేనూ అందులో పాత్రనే.'

'మైగాడ్! ఇప్పుడూ నవ్వుతూ తుళ్ళిపడే నువ్వు ట్రాజెడీలో పాత్రవా ?'

'అవును. ఈ సినిమా తీసిన రామారావు నా మిత్రుడు హీరో మురళీ, హీరోయిన్ ఉష రామారావుని పాతాళానికి అణగద్రొక్కి, ఈనాడు ఎగురుతూ తళతళ లాడుతున్నతారలు. మంచినీ, మానవత్వాన్నీ కసికొద్దీ అణగద్రొక్కిన నరపిశాచాలు.'

'గుడ్‌హెవెన్స్. మనవాడు మూడ్లో పడ్డాడు. డ్రింక్సు తెప్పించరా అది నారాయణా!' కాసేపటికి డ్రింక్సు వచ్చాయి. గ్లాసులు ఖాళీ అయ్యేయి. విస్కీ ద్రావకం గొంతుల్లోకి దిగి నడుస్తూంది.

'ఊఁ, ఇప్పటికి సరయిన మూడ్లో పడ్డాయి బుర్రలు, ఇక మొదలెట్టరా రాధాకృష్ణా.'

'స్నేహం అంటే ఏమిటి ?-' సీరియస్‌గా అన్నాడు రాధాకృష్ణ గ్లాసు క్రిందపెట్టి. రాధాకృష్ణ ప్రశ్నకి ముగ్గురూ తెల్లమొహాలు వేసారు.

'స్నేహాన్ని నిలువునా పాతిపెట్టటం కళ్ళారా చూసి నిలబడగల దమ్ములు మీలో ఎవరికయినా వున్నాయా ? నిలబడలేకపోతే మీరు పిరికి సన్యాసులన్నమాట. నిలబడి

ప్రతికగల మొండివాళ్లయితే మీ అంత రాక్షసులు వుండరన్నమాట. ఆ దృష్ట్యా నేనో రాక్షసుడిని.'

'అబ్బ! మమ్మల్ని తిట్టక కథలోకి రారా.'

'వస్తా-వస్తా.' రాధాకృష్ణ తూలుతున్న మాటల్ని తమాయించుకున్నాడు. ఆవేశాన్ని అణచుకుని చెప్పటం మొదలుపెట్టాడు. మిత్రులు చెవులప్పగించి శ్రోతలయేరు.

'నేను బందరులో బి. ఏ అయాక 'లా' చదవటానికి నాగపూరు వెళ్లాను.

నాగపూరులో ఆంధ్రావాళ్ల కాలనీవుంది. దేశంగాని దేశంలో మనవాళ్లమధ్య వుండాలన్న తాపత్రయం కొద్దీ ఆ పరిసరాల్లోనే రూముకోసం తెగతిరిగాను. అతికష్టం మీద రూము సంపాయించాను. సంపాయించటమంటే అదంతా ఒక చిత్రం.

ఆ పెద్ద మేడ ముందున్న 'ఔటు హౌస్'లో నాతో అప్పుడు మాట్లాడింది ఒక యువకుడు. చిరచారల డ్రాయరు మాత్రము ధరించి నాకు ప్రథమదర్శనం ప్రసాదించిన ఆ వ్యక్తి నా కష్టనష్టాలు అన్నీ సానుభూతితో విని వెంటనే ఆ గదిలోనే నాకు ఇంతచోటు ఇచ్చాడు. ఆదరంగా మాట్లాడి నన్ను వశపరచుకున్న అతని పేరు సూర్యనారాయణ. ఏ. ప్రజలసౌకర్యం కోసం వి. ఎస్. సూరిగా పేరు కుదించుకున్నాడట. ఆ ప్రాంతానికే నా మకాం ఆ గదికి మార్చి ఒక సమస్య పరిష్కారమయినందుకు తృప్తిగా గాలి పీల్చుకున్నాను.

సూరి ఆ వూళ్లో మెడిసన్ చదువుతున్నాడట. పుట్టినవూరు కృష్ణాజిల్లాలో ఏదో గ్రామం. చిరగా ఆకర్షణీయంగా వున్నా అతని పొడుగు రమారమి ఆరడుగులు. క్రాపు నలగనిచ్చేవాడు కాదు. నీటుగా మల్లెపూవులా వుండేవాడు. ఎప్పుడూ స్నేహితుల్తో తిరుగుతూ వుండేవాడు. వచ్చిన ప్రతిసినిమా చూసేవాడు. ఉత్సాహంగా కబుర్లు చెప్పేవాడు. అతని సాహచర్యంలో గంటలు నిముషాలవలె దొర్లిపోయేవి. అతనిచుట్టూ ఎప్పుడూ నలుగురయిదుగురు స్నేహితులు వుండేవారు.

ఆ వీధి చివర్లోనే అయ్యరు హొటలు వుండేది. అందులో భోజనం, కాఫీలు టిఫిను దొరికేవి, స్నానపానాలు కొళాయి



దగ్గర జరిగేవి. మా కాలేజీలు కూడా అక్కడికి దగ్గరే అంటూవ నేను అన్ని సౌకర్యాలతో ఆ వూళ్లో స్థిరపడినట్లే లెక్క. ఆ సంగతే తెల్పుతూ ఆదుర్దా పడవద్దని మావూరు వుత్తరం కూడా రాసేసాను.

సూరి క్షణం తీరిక లేకుండా తిరుగుతూ వుండేవాడు అతనికి నాటకాలలో ప్రవేశం వుంది. ఎప్పుడూ రిహార్సల్సూ, ప్రదర్శనలూ అంటూ బిజీగా వుండేవాడు సూరి.

మేము అద్దెకున్న ఇంటాయనా ఆంధ్రుడే ఆయన్తో అప్పట్లో నేనెప్పుడూ మాట్లాడలేదు. ఆ అవసరం ఎప్పుడూ నాకు కలగలేదు. ఆయన రిటయిరయిన ఆర్మీ ఆఫీసరు. ఆ వూళ్లో మేడ గట్టుకుని 'సెటిల'యాడట. బుంగ మీసాలు, దృఢమయిన శరీరం. పదిదాకా మేడమీద బట్టలు తీసేసి ఎండలో చలికాగేవాడు పైపు పీలుస్తూ. సాయంత్రాలు క్లబ్బుకి వెళ్లేవాడు కారుమీద. అది ఓల్డుమోడలు కారు. చీకట్తో లేచి వెళ్లి పది మైళ్లదాకా ఆయన నడిచివస్తాడని సూరి అంటాడు. ఆయన ఇద్దరు కొడుకులూ పెళ్లిళ్లు చేసుకని సెంట్రల్ గవర్నమెంటులో పెద్ద వుద్యోగాలు చేస్తున్నారట.

సూరి కలుపుగోలు మనిషి. ఆ మున లాయన్ని రోడ్డుమీద ఎక్కడో కలిసి పలకరించేవాడు. కావాలని ఆయనతో కొంతసే పటు ఆగేవాడు.

'హలో మేజర్; హౌ ఈజ్ వెదర్?'

'హలో మై బాయ్! హౌ ఆర్ యూ? వెదర్ ఈజ్ ఫైన్ ఈజిన్టి?'

'యా హౌ ఈజ్ యువర్ హెల్త్ మేజర్? డూయింగ్ ఫైన్?'

'అయామ్ ఫైన్ థాంక్యూ 'థాంక్యూ' ఏటయ్యా కబుర్లు? మన ఆంధ్రాకి ఎప్పుడు వెళ్తున్నావు? హౌ ఈజ్ అవర్ మదర్ల్యాండు? అంతా ఫైన్‌గానే వుందా?'

'ఎస్. మేజర్ ఈసారి నేను వెళ్లినప్పుడు మిమ్మల్ని తీసుకెళ్తాను. ఇద్దరం కడుపారా చూసివద్దాం, మన మదర్ల్యాండుని...'

'థాంక్యూ.'

ఆయన వెళ్లిపోయేక రూంలోకివచ్చి పొట్టపగిలేటట్టు నవ్వుకునేవాడు సూరి.

'చూసావా? చూసావా! ఆ ముసలాణ్ని బుట్టలో పెడ్తున్నాను' అంటూ వుషారుగా ఈలవేసేవాడు సూరి ధోరణికి నేను కంగారుపడేవాణ్ని తెల్లమొహంవేసి.

'ఏమోయ్! ఏంటి అల్లా చూస్తావ్? ఇంకా నీ కొత్తదనం పోలేదా అసలు ఏంటి నీకథ?' అని నన్ను నిలవేసేవాడు... 'ఏంలేదు' అని నేను సిగ్గుపడే వాణ్ని.

'రే! అరే! ఏంటా సిగ్గు? సిగ్గు ఆడదానికే అలంకారమోయ్' నీకూ నాకూ కాదు.' అని నవ్వేవాడు.

సూరి గమ్మత్తు మనిషి. చైతన్యం పరవళ్లు తొక్కుతున్న యువతకి ప్రతినిధి సూరి.

'మిస్టర్, నువ్వు ఇలా అయితే లాభం లేదు. నలుగుర్లో కలిసిపోవాలి. సినిమాకి రమ్మంటే రావు. స్నేహితుల్ని సంపాదించుకోవాలి. మానర్స్ ఇంప్రూవు చేసుకో. ఎవరితో మాటాడకుండా కూర్చుంటే నలుగురూ ఏమనుకుంటారు? ఇప్పటికే మా వాళ్లు నిన్ను ఏమనుకుంటున్నారో తెలుసా? ఎందుకులే. అన్నట్టు నువ్వు 'ఫ్రెండ్షిప్' గురించి పుస్తకాలు చదివావా?'

తల అడ్డంగా వూపాను.

'పోన్లే. నా దగ్గర వున్నాయి, చదువు.' అని తన దగ్గరున్న మూడు పుస్తకాలు తీసి ఇచ్చాడు. సూరి దగ్గర చాలా పుస్తకాలుండేవి. అతని తలగడక్రిందా రకరకాల పుస్తకాలుండేవి. ఒకసారి అతను లేనప్పుడు తీసి చూసాను.

నా తల తిరిగిపోయింది. అన్నీ సెక్స్ పుస్తకాలు. ఆడపిల్లల్ని వశపర్చుకోవటం ఎలా? స్త్రీ సౌందర్యం, గ్లామర్, ప్లేబాయ్, ఇంగ్లీషూ, తెలుగూ, హిందీ

'వెరిగుడ్! దాన్లో చదుతున్నావన్నమాట. ముందు నే నిచ్చిన పుస్తకాలు చదువు. వీటి పని తర్వాత పట్టిద్దువుగాని ఏం? యంగ్‌మాన్!'

ఉలికిపడ్డాను.

సూరి నా వెనకాల నిలబడివున్నాడు. ఎప్పుడు పిల్లిలా వచ్చాడో మరి!

'ఎప్పుడొచ్చావు?'

'ఇప్పుడే లే. రిహార్సలు క్యాన్సిలయింది. ఆ హీరోయిన్ వేసే పిల్ల రాలేదు. మన ఆడపిల్లలు ఏదగాలోయ్! నాటకంలో వేషం వెయటానికి అంతా బిడియపడటా

లెందుకో? మన గర్ల్స్‌లో ఆ 'విద్యున్ను' వుంటే ఈ కిరాయి పిల్లతో మాకు ఇన్ని బాధలు వుండేవా అని? నువ్వే చెప్పు.'

ఏం చెప్పను?

మూర్తి నాకంటె భిన్నరెట్లు విరిశిన మనిషి. అతన్తో నేను ఏ విషయంలోనూ పోటీ పోలేను. మూర్తిది డైనమిక్ పర్సనాలిటీ. అతన్నుంచి నేర్చుకోవటం తప్ప నేను అతనికి చెప్పగలిగేవి ఏవీ లేవు.

మూర్తి రాకిచ్చిన పుస్తకాలు క్షుణ్ణంగా చదివాను.

అవి నిజంగా గొప్ప పుస్తకాలు.

స్నేహితుల్ని సంపాదించుకోవటం ఎల్లా? స్నేహం నిల్పుకోవటం ఎల్లా? స్నేహం యొక్క గొప్పతనమేమిటి? చదువుతుంటే మనస్సు కొత్త వెలుగుల్ని చూస్తున్నట్లని పించింది.

మా కాలేజీ తెరిచారు.

నేను వ్యతపోగా బిడియస్తుడిని గనక చివర బెంచీలో కూర్చునేవాడ్ని. నా ప్రక్కనే పిల్లుబట్టలు వేసుకుని, సన్నగా ప్రాపు దుప్పుకుని 'రాముడు బుద్ధిమంతుడు' వంటి ఒకబ్బాయి కూర్చునేవాడు. కుర్రవాడు అందగాడే గాని ఆ ముక్కే అతని అందాన్ని దెబ్బగొట్టింది. అతని కళ్ళు నిర్మలంగా మెరిసిపోయే కళ్ళవలె వున్నాయి వాటిల్లో గొప్ప ఆకర్షణ వుంది. ఒకసారి క్లాసులో లెక్చరు జరుగుతూ వుంటే దీక్షగా ఏదో దిద్దుకుంటున్నాడు 'రాముడు'.

ఉత్సుకత కొద్దీ తొంగి చూశాను.

తన నోటు పుస్తకంలో ఏదో గేయం దిద్దుకుంటున్నాడు, రాముడు!

అదీ తెలుగులో!! ఈ దేశం కాని దేశంలో.

నా నరాల్ని పట్టి లాగినట్లయింది. గుండెలు ఊగిసలాడాయి.

నన్ను గమనించి అతను చిన్నగా నవ్వాడు.

క్లాసు అయ్యాక అతనే నన్ను పలకరించాడు

'మీ పేరు?'

చెప్పాను.

కొండ తిక్కవంతగా సంబరపడ్డాడతను. తన గురించి చెప్పాడు.

అతని పేరు రామారావట, వూరు మా జిల్లాలోనే

## మనుషులకి దూరంగా

'ఇన్నాళ్ళూ ఒంటరిగా వచ్చినట్టయాను. వూరు గాని వూళ్ళో ఏట్లాగా అని కంగారుపడ్డాను. మీరు దొరికారు. ఎంతో సంతోషం అయింది. మనం మంచి స్నేహితులుగా వుందామా?' అన్నాడు.

సంతోషంగా తల వూపాను.

మేమిద్దరం మంచి స్నేహితులమయేము.

రామారావు బాగా డబ్బున్నవాడు. కాంటీనులో కాఫీకి వెళ్ళినప్పుడు నాకు అడ్డంపడి డబ్బులు నన్ను ఇవ్వనిచ్చేవాడు కాదు. 'మనిద్దరం మంచి స్నేహితులము. ఇటువంటి చిన్న విషయాలకి దెబ్బలాడటం ఏం బాగుంటుంది?' అనేవాడు.

రామారావుకి 'ఆ పిచ్చి' వుంది. నాకూ వుంది అది. అతని నోటుపుస్తకం నిండా గేయాలు రాసాడు. అవి చదివి నా కడుపు నిండినట్లయింది. వాట్నిండా మంచి 'భావుకత' వుంది.

'ఏమయినా పత్రికలకి పంపారా?'

'పంపాను.'

'అచ్చయ్యాయా?'

ఏదో కొన్ని తీసి కటింగ్సు చూపించాడు, రామారావు.

'నేను ఈ పిచ్చిలో పడి చదువు నిర్లక్ష్యం చేస్తున్నానని అనుమానపడి మా నాన్న నన్ను ఈ వూరు తీసుకొచ్చి ఇందులో చేర్పించాడు' అన్నాడు. అతని గదికి వెళ్ళాను.

రామారావు గది అందంగా విశాలంగా వుంది. మంచి అద్దె ఇచ్చి వుంటున్నాడట. డబ్బుకి లోటులేదు. గోడల్ని అందమయిన కేలండర్లు, వర్లి 'రోజ్వుడ్' టేబులు మీద మంచి గంధపు ఏనుగుల బొమ్మ. నీటుగా సర్దిన షెల్ఫునిండా కృష్ణశాస్త్రి, నారాయణరెడ్డి, బాపిరాజు పుస్తకాలు. శుభ్రంగా తుడిచిన అద్దం ముందు ఖరీదయిన టాయిలెట్ సామగ్రి.

అన్నిటికంటె నన్ను ఆకట్టుకున్నది అతని పుస్తకాలు. ఆ పుస్తకాలు చదువుతూ నన్ను నేనే మర్చిపోయేవాడ్ని. పుస్తకాల గురించి మాట్లాడుకుంటూ మేము మమ్మల్ని మర్చిపోయేవాళ్ళము.

పోనీ నువ్వుకూడా వచ్చి ఇక్కడే వుండరాదా?' అన్నాడు రామారావు, ఒకరోజున.

'వద్దులే. అక్కడ మరో మంచి స్నేహితుడితో వుంటున్నాను. మూర్తినారాయణని మనవాడే. మెడిసిన్ చదువుతున్నాడు.'

'అల్లాగా. అతన్ని కలవాలయితే.' అన్నాడు రామారావు.

మూర్తిని పరిచయం చెయ్యాలని రామారావుని చాలాసార్లు మా రూముకి తీసుకెళ్ళాను. కాని అతను నాటకాల్లో పడి రూంలో వుంటం తగ్గించాడు. చివరికి ఒకనాడు మా అదృష్టం పండింది. మూర్తి పట్టుకున్నాము.

మూర్తి ఉత్సాహంగా వున్నాడు.

'హలో మై బాయ్! ఎల్లా వున్నావు? అసలు 'రూం'కి వస్తున్నావా? అని. ఎవరయినా 'గర్ల్‌ఫ్రెండ్' గాని తగల్లేదు గదా!' అని కన్నుకొట్టాడు నాకు మూర్తి.

నేను సిగ్గుపడ్డాను.

మూర్తి అంతే. ముందరి కాళ్ళకి బంధం వేస్తాడు.

మూర్తికి రామారావుని పరిచయం చేసాను.

షేక్‌హాండిచ్చి 'హౌ హాపీ టూ మీట్ యూ' అన్నాడు మూర్తి.

కాసేపు కవిత్వ చర్చలు, సినిమాలూ, ఆంధ్రదేశమూ సంభాషణల్లో దొర్లిపోయేయి. పనిమనిషితో కాఫీ తెప్పించాడు మూర్తి.

ఆ కాస్సేపట్లోనే నన్ను ఆకట్టుకున్నట్టే రామారావుని ఆకర్షించేడు మూర్తి.

'మీ నాటకాలు నేను చూసానండి. మీ యాక్షను అద్భుతం!'—రామారావు.

'ఈజిట్! థాంక్యూ.'

'మీరు ఆంధ్రావాళ్ళనీ తెల్సు.'

'ఆంధ్రుని కాపోతె తెలుగు నాటకాలెలా ఆడ్తాను?'

'అవుననుకోండి. మీలో హిందీ యాక్సెంటు కూడా లేకపోలేదు.'

'మరి నాతో పరిచయం కల్గించుకోలేదేం? యూ మై సోషియల్ ఫిక్?'

రామారావు సిగ్గుపడ్డాడు. మూర్తి విప్పాడూ అంతే

'అది గాదండి.'

'సిగ్గుపడ్డానంటారు. నా సెపిటీ! ఇతనూ అంతే. 'ఫస్ట్ అపాయింట్‌మెంట్'గా వుండాల్సిన కుర్రాళ్ళకి ఈ సిగ్గు ఏంటండి?'— మూర్తి దబాయించాడు.

సూరిది దబాయింపు పెక్నుక

'నిజం. నిజం.'

'ఎల్లుండి ఆడిటోరియంలో మా నాటకం వుంది. పాసులు మన వాడికి ఇస్తాను. ఇద్దరూ రండి.'

'తప్పకుండా'

'అన్నట్టు సూరీ! ఈయన కవి. గేయాలు రాస్తారు?'... నేను చెప్ప బోయాను.

'నువ్వు కథకుడివి అవునా. అవునూ. బాయిస్. మీ ఇద్దరూ కలిసి కాగితాలకి కాగితాలు రాసేసి మన ఆంధ్రాని పూపేయ గూడదూ. అదే నేనయితేనా...అన్నట్టు మీ గేయాలు పత్రికలో చూశాను రామారావు గారూ, అద్భుతం!'

'ఇతనివి ఒకటి రెండు చూసేవను కోండి. కుర్రాడు ఇంకా ఎదగాలి'

'ఏమయినా నేమిద్దరిం మీ శిష్యులమే గురూగారూ!'—అన్నాను.

'ఆ! ఏమన్నావ్! నువ్వు ఎదుగుతావోయి! వెరిగుడ్ సంతోషం. మీ ఇద్దరికి మా శిష్యత్వం ఇస్తున్నా. అడిగితే లేదనేది లేదు.'

'మహా ప్రసాదం గురూగారూ!'

సూరి సినిమాకి లాక్కెళ్ళాడు వస్తూ, వస్తూ రామారావు గదికి వెళ్ళి చూసి కాసేపు మాట్లాడి రూమ్‌కి వచ్చేసాము.

న్నాలోజుల్లోనే రామారావు మాలో కలిసి పోయేడు.

రామారావుది మెతక స్వభావం. కవి కుమారుడుగదా! అతనికంటే నేనే మెరుగు. సూరి నాటకానికి నేనూ రామారావూ వెళ్ళాము. ఒకరిద్దరు సినిమావాళ్ళు కూడా వచ్చారట. సూరి గొప్పగా నటించాడు. చూసిన నలుగురూ అన్నాటే అ టు నాకు సంతోషం కలిగించింది.

ఆ మర్నాడు సూరి రామారావుని అడిగాడు.

నాటకం ఖర్చులు బోల్డు అయేయట. కాస్త 'మనీ' సర్దమని అడిగేడు. అడిగి రామారావు దగ్గర అయిదొందలు పుచ్చుకు పోయాడు. 'వీలయినంత తొందర్లో సర్దుతా సారీ' అన్న సూరిని 'మరేం పర్లేదు సార్. బాధ పడకండి ఎప్పుడయినా ఏం కావల్సినా నేనున్నాను' అన్నాడు రామారావు. రామారావుకళ్ళల్లో ఆ సంతోషం!

# 'పెళ్ళి అయేంతవరకూ ఈ డాన్సు'

'నాకు క్లాసికల్ అంటే ఇష్టం. సినిమా డాన్సులు చూడ్డానికే ఎక్కువమంది ఇష్ట పడతారు. అంచేత, ఈరకం డాన్సు చెయ్యాలంటే నాకూ ఇష్టమే. ఈడాన్స్ చీప్‌అని నేను అనుకోను. అదికూడా ఒక ఆర్టే'—అన్నది కె. విజయలక్ష్మి శారదా విద్యాలయలో ఎస్సెసెల్సీ చదువుతున్నది కళారాధన డాన్స్ ట్రూప్‌లో ప్రముఖనర్తకి

'చదువూ, డాన్స్ రెండూ వుంటేనే రెస్పెక్ట్' వస్తుంది అనే విజయలక్ష్మి పై చదువులు చదివితే ప్రయివేటుగా చదువుతుందట డాన్సంటేనే ఎక్కువ అభిరుచి

ఉద్యోగం చేద్దామని లేదు. పెళ్ళిఅయే

## క్విక్ ఇంటర్వ్యూ

వరకూనే ఈ డాన్సు కూడా. మా అమ్మగారు ఎప్పుడు చేస్తే అప్పుడు పెళ్ళిచేసుకుంటాను ఆతర్వాత ఆయన ఒప్పుకుంటే డాన్సు చేస్తాను—అన్నది. డిగ్రీ వుండే ఆడిటర్‌ని పెళ్ళిచేసుకోవాలని వుందట!

హిందీ పిక్చర్లు ఎక్కువగా చూస్తుంది. రాజేష్‌ఖన్నా జయభాదురి అంటే ఎక్కువ ఇష్టం.

ఈ మధ్య వచ్చిన తెలుగు చిత్రాల్లో 'పండంటికాపురం' నచ్చిందట. అదీ,జమున నటనకోసం చూసిందట!

సావిత్రి అభిమాన నటి. 'ఆమెముఖం స్వీట్‌గా వుంటుంది' అంది.

'హీరోల్లో ఎవరూ ఇష్టంలేదు ఎందుకూ అంటే—'హిందీవాళ్ళని చూసి వీళ్ళనిచూస్తే అదోలా వుంటుంది. ఎట్రాక్షన్ వుండదు' —అంది.

మాడర్న్‌గా ఫాషన్ డ్రస్సు వేసుకోవాలని వుంటుందట. కాని, ఇంట్లో ఒప్పుకోరట!

'మగపిల్లలు కామ్‌గా వుండాలి. అల్లరి చేస్తే అసహ్యం వేస్తుంది....' అని విజయలక్ష్మి అభిప్రాయం.

పియానో నేర్చుకోవాలని వుందట.



కె. విజయలక్ష్మి.

స్విమ్మింగ్, చీరలమీద పెయింటింగ్ ఈమె సరదాలు.

సినిమాల్లో ప్రయత్నించదట. 'ఆ వాతావరణం నాకు నచ్చలేదు' అంది.

'పేపర్లు మరీ స్ట్రిక్టుగా దిద్దకూడదు' అనేది పరీక్షలమీద ఈమె అభిప్రాయం.

ఒకసారి ఫారిన్ చుట్టి రావాలని విజయలక్ష్మి కోరిక.

—ఏకరాజ

సంవత్సరం తిరువ తిరిగిపోయింది.

ఆ సంవత్సరంలో అడపాదడపా రామారావు సూరికి డబ్బు సర్దుతూనే వున్నాడు పుచ్చుకుంది తిరిగి ఇచ్చే ప్రస్తావనే రాలేదు. లోలోపల నాకు అదోరంగా అనిపించినా 'స్నేహాన్ని నిల్పుకోవటం ఎలా?' అన్న పుస్తకం చదివిన నేను బయట పడలేక పోయాను. రామారావు దాన్ని గురించి అసలు పట్టించుకోలేదు.

ఆ వేసవి సెలవల్లో రామారావు అక్కడనే వుండిపోయాడు.

నేనూ సూరి ఇళ్ళకి వచ్చాము.

మరలా కాలేజీలు తెరిచే వేళకి 'లింకు'లో పడి జుట్టు రేపుకుని, బట్టలు చింపుకుని ఏడ్పు మొహంతో నేను నాకి పూరులో దిగేను. 'మన ఆంధ్రావాళ్ళకి అరవాళ్ళలాగా రిజర్వేషన్లు చేసు కుని సుఖంగా రైలెక్కటం తెలీదోయ్!' అన్న సూరి మాటలు జ్ఞాపకం వచ్చేయి.

రూం దగ్గర నేను రిక్షా దిగేసరికి

పోయం(త్రమయింది.

మా రూముకి అవతలగా లాన్‌లో మూడు కుర్చీల్లో మేజరుగారూ, రామారావూ మరో మెరుపు తీగా — టీ తాగుతున్నారు.

'హల్లో'!—మేజరుగారు పల్కరించారు.

'రావోయ్!'—రామారావు.

మసిగొట్టుకున్న నా అవతారాన్ని వాళ్ళకి చూపించటం నాకు ఇష్టం లేక పోయింది. కొళాయి దగ్గరకెళ్ళి శుభ్రంగా ఒళ్ళు తోముకుని తెల్లబట్టలు వేసుకుని వాళ్ళ దగ్గర కెళ్ళాను.

మేజరుగారు కూర్చోమన్నాక ఆ అమ్మాయిని పరిచయం చేసారు. ఆ మెరుపు తీగ మేజరుగారి కూతురట. ఢిల్లీలో బి.ఏ. చదువుతూందట, ఆయన పెద్ద కొడుకు దగ్గరుండి. కొడుక్కి ఢిల్లీనుంచి ట్రాన్స్‌ఫరయిందట. అందుకని ఈ వూళ్ళో చదువుకోటానికి వచ్చిందట. ఇక ఇక్కడే వుంటుందట.

ఆ అమ్మాయి, అందానికి నిర్వచనంలా అన్పించింది. పేరు ఉషట.

చాలా కలుపుగోలుగా మాట్లాడింది. అందంగా వుండటమే గాక అందంగా మాట్లాడటం కూడా ఆ అమ్మాయి సొత్తన్పించింది.

తర్వాత రామారావు చెప్పాడు. మేమిద్దరం లేకపోవటం వలన అతనికి ఆ సెలవులు నరకంలా అన్పించేయట. మేము వచ్చామేమో అని ఆ ఇంటి చుట్టూ పిచ్చి పట్టినట్టు తిరిగాడట. ఆ సందర్భంలో అయిందట మేజరుగారి పరిచయం.

వడ్లగింజలో బియ్యపుగింజ.

మేజరుగారు టీద కదిపారట. అప్పుడు బయటపడిందట; రామారావు వాళ్ళకి దూరపు చుట్టం అవుతాడట.

రెండ్రోజుల తర్వాత సూరి దిగాడు, ఉత్సాహంలా.

ఆ తండ్రి కూతుళ్ళు ఇద్దరూ ఉదయం పూట నడకకి వెళ్ళేవారు. ఆ సమయంలో సూరి వాళ్ళని పట్టాడు. వచ్చిన కాడినుంచి సూరి అదోలా వున్నాడు. స్నానం చేసి మేడమీద తిరుగుతూ జుట్టు ఆరబెట్టుకుంటున్న ఉషని చూసి సూరి చలించటం నా కళ్ళ పడింది. ఆ మర్నాడు వుదయమే సూరి వాళ్ళని పట్టాడు,

# మనుషులకి దూరంగా

'హలో! మేజర్. హవా ఈజ్ వెదర్?'

'ఫైన్ మై బాయ్. ఎప్పుడు దిగావు?'

'రాత్రే.'

'వెరిగుడ్ మీట్ మై డాటర్...'

'వెల్ బాటవ్డ్ గాల్...'

'హప్పీ బాయ్. మీట్ మిస్ ఉషా — డాటర్ మిస్టర్ సూరి-మెడికో.'

'గ్లాడ్...'

పరిచయాలు అయ్యాయి. లేకపోతే వూరుకోడు సూరి. అతని నేర్పు అది. అటువంటి విషయాల్లో వింత ఓర్పుయినా చూపించగలి గుణం అతనిది.

ఉష కాలేజిలో చేరింది. ఇంగ్లీషు లిటరేచర్,

ఉష వచ్చాక సూరి కళ్ళలో మెరుపు వచ్చింది. కాలేజి అయ్యేక వింత పమన్నా రూముకి వచ్చి ఓ గంటపాటు వుండి పోవటం మొదలెట్టాడు సూరి. స్వీట్ వెదర్. ఇరవై సంవత్సరాల పెళ్ళికాని బాయ్ గుండెలు మత్తుగా వూగటం మొదలయింది. ఆ వూపు అంతో ఇంతో కధ కుదిరయిన నేను పసిగట్టాను. వెజుకు విలకాక కసి.

ఒకరోజు మేజరుగారు పార్టీ ఇచ్చారు ఉష పుట్టినోజు గొప్పగా జరిగింది. ఆ రాత్రే సూరి డ్రామా ప్రోగ్రాం పెట్టాడు.

గొప్పగా వుంది నాటకం. అంతకంటె గొప్పగా వుంది సూరి నటన.

ఉష కళ్ళలో మెరుపులు. పసిపిల్లలా చప్పట్లు కొట్టింది, నాటకం అయ్యాక 'గ్రీన్‌రూం'లోకి వెళ్ళి సూరిని అభినందనల్తో ముంచెత్తింది. ఉష.

'ఉషజీ' మీలాంటి వాళ్ళ అభిమానమే మాకు ప్రాణం. మీకు కృతజ్ఞత ఎట్లా చెప్పకోమ?' అని సూరి కన్నీళ్ళతో వుష చేతులు పట్టుకుని వూపేసాడు.

సూరి ఎదుగుతున్నాడు. బొంబాయి నుంచి వో డైరక్టరు వుత్తరం రాసాడట్ట, సినిమా ఛాన్సు ఇస్తాను రమ్మనమని. రామారావు దగ్గర ఓ వందరూపాయలు అప్పు పుచ్చుకుని వెళ్ళాడు సూరి. రామారావు వింతో సంతోషంగా వున్నాడు, సూరి బొంబాయి వెళ్ళినందుకు.

'మన స్నేహితుడు గొప్పవాడయితే ఆ గొప్ప మనదిగదా?' అన్నాడు నాతో.

సూరి బొంబాయిలో వుండగా ఒకనాడు 'రామారావు నాన్న' దిగారు. మేజరుగారు వుత్తరం రాసేరట. ఆ సందర్భంలో బయటపడింది మేజరుగారి ఆలోచన.

రామారావు అదృష్టవంతుడు.

తాంబూలాలు పుచ్చుకోవటం అయిపోయింది.

రామారావుకి, ఉషకి వీలయితే ఈ ఏడాది, కాకుంటే పై సంవత్సరమే పెళ్ళి, అంతా మాట్లాడుకున్నాక 'రామారావు తండ్రి' వెళ్ళిపోయాడు. రామారావుని అభినందించేను. మౌనంగా రామారావు నా అభినందనలు స్వీకరించేడు. రామారావు వెండు కుండ మనసులో ఏమున్నా తొందరపడి తేలే మనిషి కాదు.

సూరి బొంబాయి నుంచి వచ్చేడు డుక్కయ్యాడట.

షూటింగు ఆర్నెల్లలో మొదలు పెడతారట

'అదృష్టవంతుడివి! అని అభినందించి రామారావు సంగతి చెప్పాను. సూరి మొహం వివర్ణమయింది క్షణంపాటు. ఆ వెంటనే నవ్వి 'లక్కీగయ్!' అని సంతోషిస్తున్నట్టు నా చెయ్యి వూపాడు. రామారావుని అభినందనల్తో ముంచెత్తేడు. కాని, అదంతా కృతకమన్పించింది నాకు. ఉష రామారావు అంటే ముభావంగా వుంటూంది.

ఆడపిల్ల గదా. సిగ్గుపడుతుందేమో! వివాహకయినా అది సహజమేగదా! అనుకున్నాను.

బొంబాయి నుంచి వచ్చేక సూరి విజృంభించేడు. ద్విగుణీకృతోత్సాహంతో నాటకాలు వేస్తున్నాడు. అడపాదడపా రామారావు దగ్గర్నుంచి డబ్బు పుచ్చుకుంటున్నాడు.

ఓనాడు సూరి చెప్పేడు.

రెండు పాసులు నా చేతిలో పెట్టేడు.

'నటనాలయం' అని సంక్రాంతి పుల్ డ్రామా. అందులో హీరో గా నన్ను చూసి మవ్వూ రామారావు ఆశ్చర్యపోతారు, తప్పకుండా రండి' అన్నాడు

నాటకం అద్భుతం....

అందులో హీరోయిన్ ఉష!

నాటకాలకి మేజరుగారూ వచ్చారు. కూతుర్ని నాటకంలో చూసి ఆయన ఎంతో సంతోషించాడు. ఉబ్బి తబ్బిబ్బయ్యాడు. 'మై గాడ్ ఉషకి ఇంత 'హిస్ట్రియోనిక్ టాలెంట్' వుందంటే నేనిప్పుడు నమ్మలేకుండా వున్నాను' అన్నారు. కన్నతండ్రి, అది. దన్ని పిచ్చి అనీ అనొచ్చు,

ఆ మర్నాడు రామారావు ఒక గీతం రాసి నాకు చూపించాడు. దాని పేరు 'విషాద సంగీతం' నా గుండెల్ని వుక్కిరి బిక్కిరి చేసింది ఆ గీతం.

'మై గాడ్! ఇదేమిటి రొమాంటిక్ కవివి ఇల్లా 'పిసిమిస్ట్'గా అయ్యావు' అన్నాను,

రామారావు నవ్వి. 'అదంతేలే, విషాదంలో గొప్పతనం లేదా?' అన్నాడు.

'అవుననుకో.'

తర్వాత రామారావు వర్తన విచిత్రంగా అనిపించింది నాకు; ఏదో వూహించుకుని కల్లోలితుడవుతున్నాడా రామారావు?

ఉష పూర్తిగా డ్రామాల్లోపడి నన్ను మరిచిపోయినట్లయింది. ఆమె మాతో కలవటమే తగ్గిపోయింది. అర్నెల్లలో ఆరునాటకాలు ఆడేడు సూరి. రోజురోజుకి సూరి వుత్సాహం సముద్రంలా విగసిపడింది. క్షణం తీరిక లేదు. ఆ ట్రూపుకి సూరిమాట వేదవాక్కు.

ఒకరోజు సూరి నాతో అన్నాడు. 'బొంబాయి నుంచి వుత్తరం వచ్చింది, వెళ్లాలి.'

'కంగ్రాట్యులేషన్సు' అన్నాను.

'థాంక్స్. అన్నట్టు. డబ్బుకావాలి.'

'ఎంత?'

'వెయ్యి.'

నేను మౌనంగా వుండిపోయాను. స్నేహితుడికి సాయం చెయ్యాలని వున్నా ఆ సామర్థ్యం అప్పుడు నాకులేదు. కాసేపాగి సూరి అన్నాడు.

'రామారావుని అడిగాను.'

'ఏమన్నాడు?'

'మాట్లాడలేదు. ఈమధ్య తను గంభీరంగా వుంటున్నాడు. అతన్తో చెప్పి ఆ మాత్రం సాయం చెయ్యలేవా?'

'చూస్తాను.'

'చూట్టంగాదు. చెయ్యాలి' అని నా చెయ్యి పట్టుకుని వూపాడు - సూరి. నేను నవ్వాను.

ఆ సాయంత్రమే రామారావు గదికి వెళ్లాను. నే అడక్కుండానే కవర్లో పెట్టి వెయ్యి ఇచ్చాడు రామారావు 'సూర్నడికి ఇవ్వు అవసరమని అడిగేడు.' అన్నాడు.

'అతను బొంబాయి వెళ్తున్నట్టు నీకు చెప్పలేదా?'

'లేదు. కాని నాకు తెల్సు.'

సూరితత్త్వం నాకు ఆశ్చర్యం కలిగించింది. డబ్బు తీసుకువచ్చి సూరికి ఇచ్చాను.

మర్నాడుదయం—

మేజరుగారు గొల్లుమన్నారు. సూరితో పాటు ఉష మాయమయింది. మేజరుగార్ని వోదార్చి ధైర్యం చెప్పాను నామనస్సు నిలవలేదు. రామారావు రూముకి పరుగెత్తాను.

నావూహ నిజమేనా? ఉష సూరితో పారిపోయినట్టు అప్పుడే రామారావుకి తెల్సిందా?

రామారావు ఏడుస్తున్నాడు! మౌనంగానే వెక్కి ఏడుస్తున్నాడు. మొహం చేతుల్లో దాచుకుని. 'ఊరుకో ఊరుకో.' భుజం మీద చెయ్యివేసి వోదార్చాను. కాసేపటికి తెప్పరిల్లాడు రామారావు. కళ్లు తుడ్చుకుని నావంక అపేక్షగా చూసాడు

'నేను అర్జంటుగా మావూరు వెళ్లి వస్తాను.' అన్నాడు నా చెవుల్లో పిడుగు పడి నట్లనిపించింది. నేను అనుమానపడ్డాను. రామారావు అఘాయిత్యం చెయ్యడుగదా! నేను అతన్ని వెళ్ళవద్దని మొరాయించాను అసలు విషయం దాని తర్జన భర్జన చేసాను. నాకు తెల్సు.

'అదేమిటి?!' ఆశ్చర్యంగా అన్నాడు రామారావు.

'ఉష సూరితో వెళ్ళిపోయిందని నువ్వు అఘాయిత్యం తలపెట్టావు నాకు అంతా తెలుసు, నీ హృదయం ఈదెబ్బకి తట్టుకోలేకపోతూంది.' అన్నాను.

రామారావు కళ్ళు పెద్దవిచేసి చూశాడు, నవ్వి

'ఆ సంగతి నాకూ తెల్సు. కానీ నేను నువ్వనుకున్నంత దుర్బల మనస్కుణ్నికాను.' అన్నాడు.

'నీకు తెలసా? ఎలా తెలుసు?' అన్నాను. రామారావు పేలవంగా నవ్వాడు.

నవ్వి, 'వూహించానులే సర్లే నాకు టెలిగ్రాం వచ్చింది. మా నాన్నగారు పోయినట్టు టెలిగ్రాం వచ్చింది. నేను మావూరు వెళ్ళిరావాలి.'— అన్నాడు.

ఈసారి ఆశ్చర్యపడటం నావంతయింది. రామారావు ఏడ్చిన కారణం ఇదా?!

నాకు మాటలు కరువయేయి. 'నాలుగు రోజుల్లో మళ్లీ వస్తానని' రామారావు దగ్గర మాట పుచ్చుకున్నాక స్టేషనుకెళ్ళి అతన్ని రైలెక్కించి వచ్చాను. మనసు గుబులుగా వుంది. అందరూ తలోదార్నా వెళ్ళారు.

నేనూ మేజరుగారూ మిగిలాం? ఆయన ఇల్లు వదిలిరావటం మానేసేడు. ఉషచేసిన పనికి ఆయన సిగ్గుతో అవమానంతో కుమిలి పోతున్నారు. వోదార్చటం నావంతయింది.

తర్వాత పదిహేనురోజులగ్గాని రామారావు తిరిగిరాలేదు. రామారావు బాగా చిక్కిపోయాడు.

రోజులు యాంత్రికంగా తిరుగుతున్నాయి. జీవితం కృతకంగా అనిపించింది. తెగింపు అనేది మనిషికి అవసరమే, అయితే యుక్తాయుక్త విచక్షణ లేకపోయాక ఏదయినా వికృతమయిన రూపు దాలుస్తుంది సూరి ఎంతపని చేసాడు!

నేను రోజూ రామారావు గదికి వెళ్లేవాడ్ని, అతనికి నాకథలు చదివి వినిపించే వాడ్ని.

అతన్తో అతని గేయాలు చదివించుకుని వింటుండేవాణ్ని. ఒకరి కొకరం అయ్యాము.

తండ్రిపోయిన బాధని రామారావు దిగమింగేసరికి రెణ్నెల్లు పట్టింది. రామారావు ఆస్తిపాస్తులన్నీ అమ్మేసి ఇవారులక్షలు దాకా బాంకులో వేసాడట. పాపం, అతనికి ఇప్పుడు ఎవరూ లేరు. 'అన్నిబంధాలు వదిలించుకున్నాను. ఇప్పుడు నేను 'ఫ్రీబర్డుని' అన్నాడు రామారావు.

రామారావు జీవితంలో దెబ్బతిన్న మనిషి నా స్నేహితుడు. అందుకని అతన్తో నేను ప్రేమగ దయగా వుండటానికి ప్రయత్నించే వాడ్ని, అవసరానికి ఆదుకోవటం స్నేహం యొక్క మొదటి ధర్మం అని నేను సూరి ఇచ్చిన పుస్తకంలో చదివాను కాని చిత్రం ఏమంటే రామారావు నాతో మరింత దయగా, ప్రేమగా వుండేవాడు!

ఒకరోజు తెల్లవారు ఝామున మేడలోంచి మేజరుగారి అరుపులు వినిపించేయి. పరుగెత్తి వెళ్ళిచూసేను. కంగారు పడి పోయేను.

హాల్లో మేజరుగారు కోపంతో వూగి పోతూ అరుస్తున్నారు.

ఎదురుగా దిక్కుచచ్చి, వాడిపోయిన మొహంతో ఉష నిలబడి వుంది. చేతులో సూట్‌కేసు. ఉష ఎంత చిక్కి పోయింది! మనిషి ఎంత మారి పోయింది?

నేను మేజరుగార్ని సమాధాన పర్చాను.

'కడుపు చించుకుంటే కాళ్ళమీద పడ్తుంది! తర్వాత విషయం తర్వాత ఆలోచిద్దాము. ప్రస్తుతానికి మీరు ఆవేశపడకుండా వూరుకోండి.' అన్నాను.

ఏ మనుకున్నాడో ఏమో మేజరుగారు మిన్నకుండి నా చేతుల్లో పసిపిల్ల వాడిలా వాలిపోయారు. అల్లరిచేసుకుని కన్న కూతుర్ని వెలదీస్తే ఎవరికి నష్టం?

'ఉషా! లోపలికి వెళ్ళి స్నానం అదీ చెయ్యి.'—అన్నాను.

'థాంక్స్.' అని ఉష లోపలికి వెళ్ళి పోయింది.

ఆ సంగతి రామారావుకి చెప్పేదాకా నాకు ఏ పనీ తోచలేదు. అంతా విని నా కూడా రామారావు వచ్చాడు. అప్పటికి వుష స్నానంచేసి 'ఫ్రెష్'గా అయింది.

మేజరుగారూ మేం ముగ్గురమూ కూర్చుని ఇంట్లోంచి నౌకరు తెచ్చిన కాఫీ తాగాము, ఉష నూరి గురించి తప్ప మిగతా బొంబాయి విశేషాలు చెప్పింది.

అసలు ఏమీ జరగనట్లే మాటలు [illegible]యాయి. అంత గొడవ అయాకా, ఏమీ చలించకుండా ఉష కులాసాగా 'ఎక్స్‌కర్షన్'కి వెళ్ళి వచ్చినట్లు మాట్లాడింది. పశ్చాత్తాపమే లేదు. ఆమెతో రామారావు, నేను మాటలు కలిపేము.

మేజరుగారి నోట మాటే లేదు. రోజులు యాంత్రికంగా తిరుగుతున్నాయి. నెల రోజుల తర్వాత హఠాత్తుగా రామారావు నా చెవిన ఆమాట వేసేడు.

నేను ఆశ్చర్యపోయాను నానోటమాట రాలేదు. చివరికి గుండెదిటవు పర్చుకుని 'అన్నీ తెలిసే నిశ్చయానికి వచ్చేవా?'—అన్నాను.

'ఏం తెలుసు నీకు?'—అన్నాడు.

'నాకు మేజరుగారు చెప్పారు. ఉషకి మూణ్నెల్ల గర్భం.'

రామారావు ప్రశాంతంగా యోగిలా నవ్వించేడు.

'నీకు పిచ్చి పట్టిందా? అన్నీ తెలుసుండి బంగారం వంటి బ్రతుకుని పాడు చేసుకుంటున్నావు?'

'ఇందులో పాడయేదేముంది?'

'ఉష నూరి వల్ల చెడిపోయిందని తెలిసీ నువ్వు ఈ పని చేస్తున్నావంటే...'

'బలమయిన కారణం వుంది.' పూర్తి చేసేడు రామారావు

'ఏమిటది?' నేను అరిచినంత పని చేసాను

'ఏముంది? నేను ఉషని ప్రేమిస్తున్నాను గనక.' శాంతంగా అన్నాడు రామారావు

'ప్రేమా?'

'ఆఁ నేను వుషని ప్రేమిస్తున్నాను' అన్నాడు రామారావు మాటలు నిశ్చలంగా వున్నాయి. నేను మాట్లాడలేక పోయాను. రామారావు అంత మొండి మనిషని నేను వూహించలేక పోయేను. వారం తిరగ కుండానే వుషకీ రామారావుకీ పెళ్ళయి పోయింది. పెళ్ళి ఏ ఆర్భాటం లేకుండా 'సింపుల్'గా అయింది. రామారావు మకాం మారింది, మేజరుగారింటికి.

మేజరుగారి కొడుకులు వచ్చి పెళ్ళయాక వెళ్ళిపోయారు. వాళ్ళకి ఏమీ తెల్సినట్లు లేదు. మేజరుగారి హృదయాన్ని ఆయన కళ్ళని చూసి నేను చదివాను. ఆ గుండెల్లో రామారావు అంటే ఆరాధన తప్ప మరేం లేదు. రామారావుని కొడుకు కంటె ఎక్కువగా చూసుకుంటున్నారాయన.

ఒకరోజు నేను కాలేజి నుంచి వచ్చే సరికి రామారావుతో వుష వాదిస్తోంది. రామారావు నవ్వుతూ సమాధానం చెప్తున్నాడు. నన్ను చూసి ఉష లోపలి కెళ్ళింది.

'ఏమిటి సంగతి?'

'ఏంలేదు. ఈ వుత్తరం చదువు.' అని జేబులోంచి తీసి వుత్తరం ఇచ్చాడు రామారావు.

ఆ ఉత్తరం చదివాను.

అది నూరి రాసాడు. బొంబాయి నుంచి.

కొన్ని కారణాల వలన అతను [illegible] పెట్టుకుని వెళ్ళిన పిక్చరు ఆగిపోయిందట. కొత్త ఛాన్సుల కోసం ప్రయత్నిస్తున్నాడట. చేతిలో డబ్బులేదట. డబ్బు పంపించమని రాసాడు, నూరి

'అసలు నూరి మనిషేనా? అని మొహం పెట్టాలో చెప్పింది?'—నా మొహం చిరబడింది.

'ఏం? ఏందుకట?' రామారావు ప్రశ్న నన్ను నిరుత్తరుడిని చేసింది.

కాసేపటికి తమాయించుకుని 'అయితే అతనికి డబ్బు పంపించా వంటావు?' అన్నాను.

'ఆఁ.'

'ఎంత?'

'అయిదు వేలు.'

'అసలు నీ అలుసు చూసుకునే నూరి అట్లా ఆడుతున్నాడు. అడగటానికి వాడికి సిగ్గు లేకపోతే పంపటానికి నీకు సిగ్గు లేకుండా ఎట్లా పోయిందట?'

'సరిగా ఆమాటే ఉషే అంటుంది. మీరిద్దరూ ఏం మనుషులు?'

'సాధారణంగా' ఎవరయినా ఆ మాటే అంటారు, అసలు నువ్వు ఏం మనిషివి? కోతికి కొబ్బరికాయ దొరికినట్టు మీ నాన్న పోయి నీ చేతికి ఆ ఆస్తి రావటం—?'

'మాట వరసకి నువ్వే అవసరం వచ్చి అడిగాననుకో. నేను ఉండీ కాదంటే నువ్వెంత బాధ పడ్తావు? అదేనా స్నేహితమంటే?'

'నూరికీ ఇంకా నీతో స్నేహితమా? అంత ద్రోహం చేసాక...'

'మనిషన్నాక ఎవరికయినా లోటుపాట్లుంటాయి. నూరి అంతే. పొరపాటు చేసాడని స్నేహితుడ్ని వదులుకోనా? నా స్నేహితుడిలోని లోపాల్ని భరించలేని నేను స్నేహానికి అర్హుడినేనా? నువ్వే చెప్పు.'—అన్నాడు రామారావు

'నువ్వు సమర్థించినా నేను ఒప్పుకోను. ఇదంతా నీ పిచ్చి'—అన్నాను.

'నా పిచ్చిలోనే నాకానందం దాన్ని నా స్నేహితుడవైన నువ్వూ ఆనందించలేవూ?'

ఉష కాఫీ పట్టించుకుని వచ్చింది. కాఫీ పడినా నా మనసులోని గ్లాని పోలేదు.

ఆ రాత్రంతా [illegible]

'సూరిగాడు — ఇచ్చిన — ఆ పుస్తకాలు' చదివాను మరలా?

స్నేహం అంటే ఏమిటి?

స్నేహితుల్ని సంపాయించుకోవటం ఎట్లా?

స్నేహం నిల్పుకోవటం ఎట్లా?

నిజమయిన స్నేహం సుకుమారమయిన లతలాంటిది? దాన్ని నీళ్ళుపోసి, ఎరువులు వేసి శ్రమపడి ఎంతో జాగ్రత్తగా పెంచి తేనే అది నిలిచేది-ఇది పుస్తకాల్లోని విషయం, సిద్ధాంతాలకి యాదార్ధాలకి పొంతన ఎక్కడ? రామారావు యొక్క ఈ ప్రవర్తనలో ఎంత అసహజత?

తొందరపాటులో పడి రామారావు చేస్తున్నదేమిటి? విషాన్ని కౌగలించుకోవటం. కావాలని విషాన్ని మింగటం, ఆ విషం విజృంభించి మనిషి ప్రాణాలు తీస్తే...?—ఇక ఆలోచించలేను.

కాల ప్రవాహం చిత్రమయినది. తను ప్రవహించిపోతూ ఎన్నో అద్భుతాన్ని కళ్ళకి చూపుతుంది. అన్నీచూస్తూ ప్రేక్షకుడిగా నిలవటం తప్ప మనిషి చెయ్యగలదేం లేదు.

ఆ సంవత్సరమే మేజరుగారు పోయారు.

ఉషకి మగపిల్లవాడు కలిగేడు-మరుసటి సంవత్సరమే ఏదో 'చిన్నపిల్లల జబ్బు' వచ్చి అనుకోకుండానే పోయేడు. ఉష పిల్లవాడ్ని గురించి బెంగపెట్టుకుని కొన్నాళ్ళు మంచం ఎక్కింది.

సూరి ఒకటి రెండు పిక్చర్సులో వచ్చేడు. చిన్న చిన్న పాత్రలు.

ఆ తర్వాత ఒక పిక్చరులో అతను 'విలన్' వేషం వేసేడు.

సినిమాలని, పిక్నిక్కులని, నాటకాలని ఉష బెంగతీరటం కోసం రామారావు ఉష కొరకు ఎన్నో ప్రయత్నాలు చేసేడు. దానికోసమే రామారావు చదువుకి తిలోదకాలు ఇచ్చేడు. ఉషకి రామారావు భర్త వటం నిజంగా ఆమె అదృష్టం!

నా చదువు ఆఖరి సంవత్సరంలోకి వచ్చింది.

ఆ ఏడాది చివర్లో సూరి నటించిన పిక్చర్లు ఎన్నో వచ్చేయి. అతని పేరు ప్రఖ్యాతి చెందింది. ఆరోజుల్లో ఒకసారి నాగపూర్లో సూరి నటించిన పిక్చరు శత దినోత్సవం జరిగింది. ఆ సందర్భంలో బొంబాయినుంచి, సూరి వచ్చాడు.

సూరి సరాసరి రామారావు ఇంట్లో దిగేడు, ఆశ్చర్యం! ఉష అతనికి సాదరంగా స్వాగతం పలికి నెత్తిమీద పెట్టుకుంది! అప్పటికీ ఇప్పటికీ సూరి ఏం మారలేదు. కళ్ళు మాత్రం కొంచం గుంటలు పడ్డాయి. సన్నబడి ఆకర్షణీయంగా వున్నాడు. అసలు ఏం జరగనట్లే ప్రవర్తించాడు సూరి. అది అతనికే చెల్లింది. ఆమాట అంటానికి నాకూ 'దమ్ము' లేదు. పిక్చరు శత దినోత్సవం బ్రహ్మాండంగా జరిగింది. నేనూ రామారావు ఉషా ఆ ఉత్సవానికి పాసులమీద వెళ్ళాము. తర్వాత రెండు రోజులుండి సూరి బొంబాయి వెళ్ళిపోయాడు. ఆ సమయంలో ఏం జరిగిందీ తెలీదుగాని, పదిరోజుల తర్వాత రామారావు నా దగ్గరకి వచ్చి అన్నాడు: 'మిత్రమా! మరలా నిన్ను నేను తిరిగి చూస్తానో చూడనో. ఆకరిసారి నిన్ను కనులారా చూసి పోదామని వచ్చాను' అన్నాడు.

నేను వొణికి పోయాను

'అదేమిటి? రామారావు?'

'అవును. నేనూ, ఉషా బొంబాయి వెళ్ళున్నాము: నాగపూర్నించి మకాం ఎత్తేస్తున్నాము.'

'ఎందుకు?'

'పిక్చరు తీస్తున్నాను సూరి సహాయం చేస్తానని మాట ఇచ్చాడు. ఉష హీరోయిన్‌గా సూరితో పిక్చరు తియ్యాలని ఉద్దేశ్యం.' అన్నాడు. కాసేపు నిలవు గుడ్లు వేసుకుచూసి చివరికి అన్నాను

'ఈ బుద్ధి నీకు పుట్టిందిగాదు. ఉష బలవంతం, అంతా అవునా?'

'మా ఇద్దర్లో ఎవరయితే నేం?'—అతని మాటల్లో విశ్వాసం నిండి వుంది.

రామారావు నిశ్చయించుకున్నాక అతన్ని మార్చటం జరిగే పనిగాదు. ఆ రోజంతా నాతోనే వుండిపోయేడు రామారావు. ఎన్నో కబుర్లు, పాత విషయాలన్నీ తిరగేసుకున్నాము. రామారావు తన పుస్తకాలన్నీ నాకు బహుమతిగా ఇచ్చేడు. ఏనుగుల బొమ్మని ప్రజంటుచేసి జాగ్రత్తగా వుంచుకోమన్నాడు.

మర్నాడే ఉష రామారావుని తీసుకుని బొంబాయి వెళ్ళిపోయింది.

తర్వాత కొన్నాళ్ళవరకూ నాకు వాళ్ళ సంగతులు తెలియలేదు.

ఆ సంవత్సరమే నేను నా చదువు పూర్తి చేసుకుని ఇంటికి వచ్చాను. నాగపూరుకి గుడ్‌బై చెప్పి.

ఈ ఊరిలో ప్రాక్టీసు పెట్టాను అదృష్టం కలిసివచ్చి మంచి లాయరుగా పేరూ డబ్బూ వచ్చిపడ్డాయి. తర్వాత రామారావు ఉత్తరాలు రాస్తుండేవాడు బొంబాయినుంచి.

పిక్చరు మొదలు పెట్టేడట. సూరి హీరో. ఉష హీరోయిన్. సూరి బాగా సహాయంచేస్తున్నాడనీ ఉష బ్రహ్మాండంగా నటిస్తోందనీ, పిక్చరు గొప్పగా వస్తోందనీ రాసేవాడు రామారావు. షూటింగు అయిపోవచ్చిందట. దేవుడు మేలుచేసి అంతా సవ్యంగా జరిగితే మరో ఆర్నెల్లకి పిక్చరు విడుదలవుతుందని రాసేడు. ఆ ఉత్తరం వచ్చి ఆర్నెల్లయ్యాక రామారావునుంచి ఉత్తరాలు రావటం ఆగిపోయింది.

నేను ఎన్ని ఉత్తరాలు రాసినా అతన్నుంచి జవాబు రాలేదు.

నాలోని స్నేహితుడు అదుర్దాపడ్డాడు: రామారావుకి ఏమయింది? ఉన్నట్టుండి మనిషి ఎందుకని అలా అవాక్కు అయిపోయేడు? ఆ ఆదుర్దాలో సూరికి ఉత్తరాలు రాసేను. అతని ఎడ్రసు, నాకు సరిగా తెలియదు: నా ఉత్తరాలు సూరికి అందేయో లేదో తెలీదుగాని అతన్నుంచి జాబు రాలేదు. ఒకసారి నేను 'లీగల్ ఎడ్వయిజరు'గా వున్న కంపెనీ పనిమీద బొంబాయి వెళ్ళవలసి వచ్చింది, పనిలో పని. రామారావుని సూరిదీని చూడవచ్చుని నా గుండెలు పొంగిపోయాయి.

బొంబాయిలో దిగేక రామారావు కోసం స్టుడియోలన్నీ గాలించాను. అతన్నిగురించి ఎవరూ సరిగా చెప్పలేకపోయేరు. తిరిగి తిరిగి శరీరమూ మనసూ అలిసిపోయింది: అయినా నా ప్రయత్నం మానలేదు. చివరికి ఒక మారుమూల స్టుడియోలో నాకు కావలసిన సమాచారం దొరికింది.

రామారావు ఇప్పుడు బొంబాయిలో లేడట

రామారావు 'పూర్తిగాని ఆ పిక్చర్ని' ఎవరికో అమ్మేడుట. ఆ డబ్బుని ఒక అనాధ శరణాలయానికి ఇచ్చి రామారావు ఎక్కడికో వెళ్ళిపోయేడట. అది జరిగి ఆర్నెల్లయిందట, రామారావు ఎక్కడ్కి

వచ్చిందీ ఎవరికీ సరిగా తెలీదు.

రామారావు ఏమయినట్టు? అసలు ఏం జరిగిందింతకీ.

సూరి గురించీ, ఉష గురించీ వాకబు చేసాను.

వాళ్ళిద్దరూ ఏదో పిక్చరు షూటింగు పురస్కరించి కాశ్మీరు వెళ్ళి పదిహేను రోజులుందట. బహుశా ఇవాళో రేపో దిగచ్చు అని. ఆ వ్యక్తి ఎవరికో ఫోను చేసాడు. మాట్లాడి ఫోను పెట్టేసాక 'మీరు అదృష్టవంతులు. వాళ్ళు ఇద్దరూ ఇవాళ 'పంజాబ్ మెయిల్'లో వస్తున్నారట. కావాలంటే మీరు స్టేషన్లో కలుసుకోవచ్చు' అన్నాడు.

స్టేషనుకి వెళ్ళాను.

జనం తండోపతండాలు పూలమాలలు ప్లాటుఫారం క్రిక్కిరిసివుంది. మెయిలు వచ్చింది. చిరునవ్వులు చిందిస్తూ ఉషా, సూరీ దిగేరు. వాళ్ళని చూడటానికి జనం తొక్కిసలాడేరు. ఆ జనంలో వాళ్ళతో నేను మాట్లాడలేకపోయేను. ఎవరో 'అభిమాని'ని అడిగితే వాళ్ళ అడ్రసు ఇచ్చేడు.

'జనతా'లో వాళ్ళ బంగళాకి టాక్సీ చేసుకుని వెళ్ళేను.

ఉష నన్ను గుర్తించింది. ఆదరంగా మాట్లాడింది. మర్యాదలు చేసింది. సూరి ఇంట్లో లేడట. షూటింగుందని వెళ్ళాడట; వెంటనే.

మాటల్లో ఉష చెప్పింది. వాళ్ళకి ఇద్దరు పిల్లలట. పబ్లిక్ స్కూలులో చదువుతున్నారట. పిల్లలిద్దరూ సూరి పోలికేనట. ఈ మధ్య ఉష అప్పలు వచ్చి పోతున్నారట!

నా గుండెలు రామారావుగురించిన ప్రశ్నతో పూడిపలాడేయి. కాని ఏమీ అడగలేకపోయాను. ఉష మాటల్లో ఆ ప్రస్తావనే రాలేదు. సాయంత్రానికి సూరి వచ్చాడు. అతన్ని చూచి నేను నిజంగా భయపడ్డాను. సూరి ఆదరంగానే మాట్లాడాడు. ఎన్నో విషయాలు చెప్పేడు. అంతా స్వోత్కర్ష.

## మనుషులకి దూరంగా

'రెండ్రోజులుంటావా?' అన్నాడు. 'లేదు ఇవాళే వెళ్తా' అన్నా. ఎన్నో కబుర్లు అనర్గళంగా మాట్లాడిన సూరి మాటల్లో రామారావు ప్రస్తావన అసలు రానే రాలేదు అడుగుదామని ఎంత ప్రయత్నించీ నేను అడగలేకపోయాను. ఇక అక్కడ ఉండటం నావలన కాలేదు. ఉక్కిరిబిక్కిరి అన్పించింది.

తిరుగు ప్రయాణానికి రైలెక్కిన నా కోటు జేబులో బరువుగా ఒక కవరు అప్రయత్నంగా చేతికి తగలటం నాకు ఆశ్చర్యం వుత్సుకతా కలిగించింది. కవరు చించి చూసాను. అది ఎవరు పెట్టారో నేను వూహించగలను. ఆ ఉత్తరం రామారావు రాసింది—సూరికి.

'మిత్రమా! జీవితంలో నేను ఏర్పర్చుకున్న విశ్వాసం పునాదులతో కదలిపోయింది. ఇక నేను మనుషులమధ్య బ్రతకలేను. అందుకే ఎక్కడికో వెళ్ళిపోతున్నాను. ఈ మనుషులకి దూరంగా ఒంటరితనం వెతుక్కుంటూ మన స్నేహాన్ని, పాతస్మృతుల్ని నెమరువేసుకుంటూ కాలం గడిపేస్తాను. ఉష మంచిపిల్ల. ఆమెను జాగ్రత్తగా చూసుకో—'రామారావు.'

రామారావు సూరికి రాసిన ఆ వుత్తరం ఉష నా జేబులో ఎందుకు పెట్టినట్లు?! ఏమో! ఆడది గనుక ఉషకి ఇంకా నామీద రామారావుమీద, మా స్నేహంమీద ఏమూలో జాలి అనేది మిగిలివుందా?!!...' దీర్ఘంగా నిట్టూర్చి రాధాకృష్ణ ఆగేడు. అతని మొహం తడిసి వికృతంగా అయింది.

'గురూ! ఉషది గొప్ప ప్రేమ. అది గ్రహించలేక రామారావే తొందరపడ్డాడు. అతన్నిజంగా పిచ్చాడు.' అది నారాయణ మాటలు తూలేయి. 'షటప్' రాధాకృష్ణ గర్జనకి ఆదినారాయణ నోరు మూసేడు.



## దర్శకుడు తాపీ చాణక్య హఠాన్మరణం

ప్రముఖ చలనచిత్ర దర్శకుడు శ్రీ తాపీ చాణక్య జూలై 14 వ తేదీ రాత్రి మదరాసులో మరణించారు. ఆయన వయస్సు 48 సంవత్సరాలు.

శ్రీ చాణక్య రెండవ ప్రపంచ యుద్ధ కాలంలో సైన్యంలో పనిచేశారు. 1948లో సినిమా రంగంలో అడుగు పెట్టారు. దర్శకుడు శ్రీ బి. ఎ. సుబ్బారావు వద్ద 'పల్లెటూరి పిల్ల' చిత్రానికి సహాయ దర్శకుడిగా పని చేశారు.

'అంతా మనవాళ్లే' శ్రీ చాణక్య దర్శకత్వంలో వెలువడిన మొదటి చిత్రం.

'రోజులు మారాయి' ద్వారా తమిళ చలనచిత్ర రంగానికీ, 'రాముడు-భీముడు' ద్వారా హిందీ చిత్రసీమకు పరిచయమై అఖిల భారత ఖ్యాతి నార్జించారు.

చనిపోయే నాటికి 'గంగ — మంగ' తెలుగు, తమిళ చిత్రాలకి దర్శకత్వం నిర్వహిస్తున్నారు.

వీరికి భార్య, ఒక కుమారుడు, ఒక కుమార్తె ఉన్నారు.

Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1 and at Andhra Patrika Press, Mallikarjuna Rao Street, Gandhinagar, Vijayawada 3.
Editor : S. Radhakrishna.